# ముఖచిత్రం


జాన్ సింగర్ సార్జెంట్ (1856-1925)

ఇతడు ఫ్లారెన్స్‌లో జన్మించాడు. బాల్యం అంతా ఒక నగరం నుంచి మరో నగరానికి మారటంతోనే సరి పోయింది. అతడి కళాధ్యయనం పారిస్‌లో జరిగింది. వాస్తవిక, సాంప్రదాయిక శైలిలో చిత్ర లేఖనం సాగించాడు. ముద్రావాదం (impressionism) తో కూడ ప్రభావితుడు కాక పోలేదు. అతడు ముఖ్యంగా అమెరికా, ఇంగ్లాడులో బాగా ప్రసిద్ధి చెందాడు. మనుషుల, మనుషుల ముఖాల వర్ణ చిత్రాలు వేయడంలో చేయితిరిగిన వాడు. వీటిపై భ్రాంతి కోల్పోయిన అతడు కుడ్య, హర్మ్య ఉపరితలాలపై చిత్రలేఖించడం మొదలు పెట్టాడు. స్థల దృశ్యాలను తైల, జల వర్ణాలతో చిత్రించాడు అతడు అవివాహితుడే అయినా కుటుంబం అన్నా, స్నేహితులన్నా అతనికి అభిమానం.

## చిత్రం గురించి :

సార్జెంట్ చిత్రాలలో కెల్లా మేడమ్ అత్యంత ప్రసిద్ధిమైంది. మేడమ్ అంటే మేడమ్ పీరె గాత్రూ (Madame pieree Goutreau). ఈ చిత్రం ఒక పెద్ద దుమారం లేపింది. అందుకేనేమో ఇది అంత ప్రసిద్ధమైంది. మేడమ్ ఒక అమెరికన్ అందాల యువతి ఈమె బాగా డబ్బున్న పారిస్ వడ్డీవ్యాపారిని పరిణయ మాడింది. ఒకసారి సార్జెంట్ ఆమెను కలిసినప్పుడు వింత అయిన, సంప్రదాయ బద్ధంకాని, ఆమె సౌందర్యం అతనిని ఆకట్టు కొంది. ఆమెను మోడల్‌గా అంగీకరింప జేసేవరకు అతడు నిద్రపోలేదు. అయితే ఈ చిత్రాన్ని సౌందర్య విలువల దృష్ట్యా కొంతమంది ఈసడించుకొన్నారు. ఎందుకంటె ఆ అతి విపుతీకృత, శైలీకృత భంగిమ అనాకారిగా ఉన్నది. ముఖ్యమైన విమర్శ ఆమె లజ్జాహీనమై; కోపంతెప్పించే దృక్పధం మీదికి, నైతిక పెళుసుదనాన్ని సూచించే ఆమె ఎదురుబారను ప్రదర్శించే, దుస్తుల మీదికి ప్రసారితమైంది ఆమె తల్లి ఈ చిత్రాన్ని చూసి నిర్వేదం పొంది, ప్రదర్శనునుంచి దానిని

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 9 ఆగష్టు 1997 సంచిక 7

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **మేడమ్ 'X'**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

## Churchill Asked Why Gandhi Hadn't Died Yet

Churchill was against the Gandhi-Irwin meeting in February, 1931. He was "upset" by "the nauseating and humiliating spectacle of this one-time Inner-Temple lawyer, now seditious fakir, striding half-naked up the steps of the Viceroy's palace, there to negotiate and to parley on equal terms with the representative of the King Emperor". In November, 1941, Churchill opposed the British War Cabinet's decision to release the imprisoned Congress leaders and said: " When you lose India, don't blame me". In a speech at the Lord Mayor's banquet on November 10, 1942, Churchill clearly explained his stand: "...let there be no mistake about it in any quarter. We mean to hold our own. I have not become the King's First Minister in order to preside over the liquidation of the British Empire".

Churchill saw to it that Cripps proposals were doomed to failure. They were merely meant to placate " the liberal in Roosevelt". Lord Wavell, who met Churchill in London on March 29, 1945, notes in his "journal": "The P.M. then launched into a long jeremiad about India which lasted about 40 minutes. He seems to favour partition into Pakistan, Hindustan, Princestan etc." Churchill opposed food aid to India at a time when millions were dying of starvation in Bengal, in spite of Lord Wavell's frantic request. Wavell notes in his "journal" on July 5, 1944: "Winston sent me a peevish telegram to ask why Gandhi hadn't died yet. He has never answered my telegram about food". Such was the man who had the audacity to vilify Indian leaders — men of the stature of Gandhi, Nehru, Subhas Bose, Maulana Azad, Sardar Patel, to name only a few — as "men of straw".

Perhaps the most poignant words on the impending demise of the British Empire came from Tagore: " The wheels of fate will some day compel the English to give up their Indian Empire. But what kind of India will they leave behind, what stark misery? When the stream of their centuries-old administration runs dry, what a waste of mud and filth will they leave behind them!" ("Crisis in Civilization").

# శూన్యాన్ని పూరించేది కవిత్వం

(నోబెల్ బహుమాన స్వీకార ప్రసంగం 1987)

అనువాదం, సంక్షిప్తీకరణ :

(బ్రాడ్స్కి) – డా. డి. చంద్రశేఖర రెడ్డి
– కాకాని చక్రపాణి

సంక్షిప్త పరిచయం :

జోసెఫ్ బ్రాడ్స్కికి 1987లో నోబెల్ బహుమతి లభించింది. ఈ బహుమతి పొందిన వారందరిలోకి చిన్నవాళ్లలో రెండవ వాడు బ్రిడ్స్కి. అప్పుడతని వయస్సు 47 సంవత్సరాలు.

ఆయన ముఖ్యరచనలు - **Short and Long Process, 1965; A Half in the wildernen, 1970; The End of a Beautiful Epoch; Poems 1964-71, 1977; A Part of Speech, 1977; Roman Elegies, 1982; New Stanzas to Augusta, 1983; Urania, 1987; the play - Marbles, 1984; the essay collection - Less than one (1986)**

ప్రసంగం :

జీవితమంతా ఒక సామాజిక ప్రాముఖ్యం కలిగిన పాత్రను నిర్వహించకుండా వ్యక్తి గతమైన జీవితం గడిపిన వాడికి, నియంతృత్వానికి బలికావడం కంటే ప్రజాస్వామ్యంలో ఒక పెద్ద వైఫల్యంగానయినా ఉండడానికి ప్రాధాన్యం ఇచ్చి మాతృభూమికి ఎంతోదూరంగా జీవిస్తున్న వ్యక్తిని అకస్మాత్తుగా ఈ వేదికమీద నిలబడడం కొంత అసౌకర్యంగానూ, ఇబ్బందిగానూ ఉండక తప్పదు. శైలీ పరమయిన సమస్యలు కారణంగా ఒక రచయిత మరోరచయితనుగాని ఒక కవి మరో కవినిగాని ప్రాతినిథ్యం వహించడం సాధ్యపడదు. ఒసిప్ మాండెల్స్టామ్, మారిన స్వెతేలా, రాబర్ట్ ఫ్రాస్ట్, ఆనా అఖ్మతోవా, విస్టన్ ఆడెన్‌లుకూడా ఇక్కడ నిలుచున్నప్పుడు తమగురించే మాట్లాడి ఉంటారు. వాళ్లుకూడా కొంత ఇబ్బంది పడే ఉంటారు. నేను ఈ అయిదుగురిని మాత్రమే పేర్కొనడానికి కారణం వీరి కృషినాకెంతో ముఖ్యమైంది కావడం, వాళ్లేకనుక లేకపోతే. మనిషిగానూ, రచయిత గానూ కూడా నేను ఇంత వాణ్ణయి ఉండను. ఏది ఏమైన ఈ స్థానంలో నిలబడి ఉండి ఉండేవాణ్ణి కాను. ఈ అయిదుగురే కాదు, మరెందరో వెలుగు నందించిన వారున్నారు. ఏరచయిత కయినా ఇటువంటి పరిస్థితే ఉంటుంది, కాని రెండు సంస్కృతులను సొంతం చేసుకోవడం వల్ల నాకిది రెట్టింపయింది. ఇక్కడనేను అనేక రకాల విషయాలను తడమవచ్చు, వాటి మధ్య సంబంధం ఉండకపోవచ్చు, విచిత్రంగా ఉండవచ్చు. అయినా నాకుకేటాయించిన సమయం నేను అరాచకంగా ఉండకుండా కొంతకాపాడుతుంది.

---

★ డా. డి. చంద్రశేఖర్ రెడ్డి, కాకాని చక్రపాణి గారలు ఆంధ్ర సారస్వత కళాపరిషత్తు కళాశాల హైదరాబాద్‌లో వరుసగ తెలుగు, ఆంగ్లశాఖలలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

కళ అనేది ఏమైనా బోధించినట్లయితే (ముఖ్యంగా కళాకారునికి) అది మనిషి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని - ఎందుకంటే ఇది అతిప్రాచీన మయినది; మనిషిలో తెలిసో, తెలియకో ఒక విశిష్టతను, ప్రత్యేకతను పెంపొందించి మనిషిని సామాజిక జంతువులనుండి, ప్రత్యేక ప్రతిపత్తిగల 'నేను'గా మారుస్తుంది. ఒక కళారూపం, ముఖ్యంగా రచన, అది ప్రత్యేకంగా కవిత్వం మనిషితో ప్రత్యక్షంగా సంబంధం పెట్టుకొంటుంది. అందువల్లే నాయకులు దీన్ని అంతగా ఇష్టపడరు. కళ రంగప్రవేశం చేసినచోట, కవిత్వం చదివిన చోట అంగీకారం, ఏకగ్రీవాల స్థానంలో నిర్లిప్తత, భిన్నాభిప్రాయాలు చోటు చేసుకుంటాయి. నిశ్చయత్వం స్థానంలో పరధ్యానం, అసహనాలు చోటు చేసుకుంటాయి. మరో విధంగా చెప్పాలంటే ఇది శూన్యాలను మనుషులుగా పరివర్తిస్తుంది.

బారటినిస్కీ తన సరస్వతిని ఒక అసాధారణమయిన ముఖం కలిగినట్లు చిత్రించాడు. మనిషి ఉనికికి ఈ అసాధారణత్వమే అర్థం. రచయిత కయినా, పాఠకుడికయినా ఎంత గొప్పదయినప్పటికీ ఎవరో నిర్దేశించిన జీవితాన్ని గాక, తనస్వంత జీవితాన్ని స్వంతంగా నిర్మించుకోవడమే లక్ష్యం. ప్రతి వ్యక్తికీ ఒక్కటే జీవితం ఉంటుంది, అది ఎట్లా అంతమవుతుందో మనందరికీ బాగా తెలుసు. ఇటువంటి జీవితాన్ని ఎవరిలాగానో, ఎవరి అనుభవాన్ని బట్టో, పునరుక్తంగా వ్యర్థం చేసుకోవడం, మరీ ముఖ్యంగా మనతో పాటు మన సమాధి దాకా నయినా వచ్చి కృతజ్ఞతలు చెప్పని నేతలకోసం వృథా చేసుకోవడం ఎంతో విషాదకరం.

భాషా సాహిత్యాలు మరేయితర సామాజిక వ్యవస్థకన్నా అతిప్రాచీన మయినవి, వాంఛనీయమయినవి, శాశ్వతమయినవి. రాజ్యంపట్ల సాహిత్యం చూపించే నిర్లిప్తత, తిరస్కారం, వ్యంగ్యం - ఒక ప్రతిస్పందన. తాత్కాలికతకూ, పరిమితత్వానికీ వ్యతిరేకంగా శాశ్వత్వం కోసం, అనంతత్వంకోసం ఈ ప్రతిస్పందన. సాహిత్య విషయాలలో రాజ్యం జోక్యం చేసుకున్నంత వరకూ, సాహిత్యంకూడా రాజ్యవ్యవహారాలలో జోక్యం కలిగించుకోవచ్చు. రాజకీయవ్యవస్థ భూతకాలానికి సంబంధించింది. వర్తమానం మీద అధికారం కోసం ప్రయత్నిస్తుంది. ఏ సామాజిక వ్యవస్థ అయినా ఇంతే.

రాజ్య తత్వం, నీతి, కళాసిద్ధాంతాలు అన్నీ 'నిన్నటివే' భాషా సాహిత్యాలు ఎప్పుడూ 'నేటివే'. రాజకీయ వ్యవస్థ మరీ సాంప్రదాయిక మయినప్పుడు ఇవి 'రేపటివి' కూడా కావచ్చు. కళ ముఖ్యంగా సాహిత్యం అద్భుతమయినది కావడానికి కారణం అది పునరుక్తిని అసహ్యించు కోవడమే. నిత్య జీవితంలో ఒక జోకు మూడుసార్లు చెప్పి మూడుసార్లు నవ్వించవచ్చు. కాని సాహిత్యంలో ఇది 'పునరుక్తి దోషం'.

కళ చరిత్రకు పర్యాయపదం కాదు, దానికి సమాంతరం. నిరంతరమూ ఒకనూతన కళాత్మక వాస్తవికతను సృష్టిస్తూ ఉంటుంది ఇది. అందుకే అది ప్రగతికంటే ముందుంటుంది. చరిత్రకంటే ముందుంటుంది. మనం మార్క్సు కంటే ముందుకు పోవద్దా?

నేడు కవి, రచయిత సామాన్యుల భాషను వాడాలంటున్నారు. చాలా ప్రజాస్వామికంగా కనిపిస్తున్నప్పటికీ, రచయితకు చాలా అనుకూలంగా కనిపిసునాపటికీ ఈ సిద్ధాంతం

అసంబద్ధమనీ, సాహిత్యాన్ని చరిత్రకు బానిసగా చేసే ప్రయత్నమేననీ చెప్పక తప్పదు. మానవ ప్రగతి ఆగిపోతే తప్ప సాహిత్యం ప్రజలభాష మాట్లాడరాదు. ప్రజలే సాహిత్య భాష మాట్లాడాలి.

జోసెఫ్ (బ్రాడ్స్కీ) 24 మే 1940 రష్యా లెనిన్ గ్రాడ్‌లో రష్యన్ యూదు దంపతులకు జన్మించాడు. అతడు 15వ యేట స్కూలు వదిలి వేశాడు. 1956-62 సంవత్సరాల మధ్య పదమూడు సార్లు ఉద్యోగాలు మార్చాడు. 1956 లో హంగరీ ఆక్రమణను గురించి ఇలా అన్నారు: ''నా ఈడు కుర్రవాళ్ళు దేనికీ భీతి చెందరు. మాకు అబాద్ధాలంటే ఏమిటో, రెండునాల్కలంటే ఏమిటో, ద్వంద్వ ప్రమాణాలంటే ఏమిటో; దయారహితంగా ఉండడం అంటే ఏమిటో తెలుసు. మాకు మేమే అబాద్ధాలు చెప్పుకొన్నాము. హంగరీ ఆక్రమణ నా తరాన్ని ఖంగు తినిపించింది. బాధించింది, దుఃఖింపించింది''.

సోవియట్ యూనియన్ అతనిని సైబీరియాకు ప్రవాసం పంపింది. ప్రవాసంలో ఉండగా రాసిన పద్యాలు దొంగతనంగా అమెరికా చేరి అక్కడ 1965లో అచ్చుయ్యాయి.

అతని రచనలు బహిరంగంగా ఎప్పుడూ రాజకీయాలతో ప్రమేయం పెట్టుకోలేదు అయినా అతడు ప్రభుత్వం కోపానికి గురై జైలు పాలయ్యాడు. 1964లో అతనిని ''సామాజిక పరాన్న భుక్కు'' (Social Parsite) అని ముద్రవేసి; కోర్టు విచారించి జైలు వేసింది. ''భౌతిక విలువల పరంగా, వ్యక్తి, సంక్షేమ పరంగా అతడు ''రష్యా మనిషి'' నిర్వహించవలసిన విధులను నిర్వహించలేదు.''

ఆ తరువాత అతనిని 1972లో వియన్నా ప్రవాసం పంపించి ప్రభుత్వం. బ్రెజనేవ్ ప్రభుత్వం నిషేధించిన మొదటి సాహిత్య కారుడు ఇతడే.

అతర్జాతీయ కావ్య పఠన పండుగలో, లండన్ ఎలిజబెత్ హాలులో, అతడు తన పద్యాలను చదివి వినిపించాడు.

1961-62లలో 10,000 పంక్తుల మౌలిక పద్యాలను రాశాడు. ఇవి ఇతర దేశాలలో అచ్చుయ్యాయి కాని, తన దేశంలో రహస్యంగానే జనం చదువుకోవలిసి వచ్చింది.

అతడు ప్రవాసంలో ఉండగానే అనేక అవార్డులు అందుకొన్నాడు. అనేక బిరుదులను అందుకొన్నాడు. యేల్ విశ్వవిద్యాలయం 1978లో గౌరవ డాక్టరేట్ పట్టం ఇచ్చింది. 47వ యేటనే నోబెల్ బహుమతిని అందుకొన్నాడు, అతి పిన్న వయస్సులో నోబెల్ బహుమతి అందుకొన్న వారిలో ఇతడు రెండోవాడు.

''ఆలోచనా స్పష్టత, కావ్యతా తీవ్రతలతో
నిండిన సర్వవ్యాపక రచనా శీలం ప్రదర్శించినందుకు''

—సంపాదకుడు.

కళాత్మక ఎంపిక వ్యక్తికి సంబంధించింది, కళానుభవంకూడా వ్యక్తి గతమే. ప్రతి నూతన కళాత్మక వాస్తవికత వ్యక్తి అనుభవాన్ని మరింత వ్యక్తిగతం చేస్తుంది. ఇది సాహిత్యాభిరుచి రూపాన్నిధరించి బానిసత్వానికి వ్యతిరేకంగా రక్షణకవచంగా పనిచేయవచ్చు. ఒక సాహిత్యాభిరుచి ఉన్న వ్యక్తి రాజకీయసిద్ధాంతాల ఆకర్షణను నిరోధించగలడు. వ్యక్తి కళానుభవం ఎంత ఎక్కువయితే అతని అభిరుచి అంత ఉత్తమమూ, అతని నైతికత అంత తీక్షణమూ అవుతుంది. అతను సుఖం పొందుతాడో లేదోగాని స్వతంత్రుడవుతాడు. 'సౌందర్యం ఈ ప్రపంచాన్ని కాపాడుతుంది' అన్న దొస్తో విస్కీ మాటల్నీ, 'మనం కవిత్వం వల్ల రక్షింప బడతామ'న్న మాథ్యూ ఆర్నాల్డ్ విశ్వాసాన్నీ ఈ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. మానవ శాస్త్రపరంగా మనిషి ఒక నైతిక ప్రాణి కావడానికంటే ముందు కళాత్మక ప్రాణి అని వక్కాణిస్తున్నాయి. పశురాజ్యంలో మనల్ని వేరుచేసేది ఏమిటి? భాష, సాహిత్యం, మరీముఖ్యంగా కవిత్వం; ఇది మనజాతికి గమ్యం.

సంగీతం ఒకవ్యక్తిని శ్రోతగానో, గాయకుడుగానో ఎంపికకు అవకాశమిస్తుంది. కాని సాహిత్యం అతన్ని ప్రయోక్తను మాత్రమే చేస్తుంది. మితిమీరిన జనాభా పెరుగుదల, సర్వదా పెరుగుతున్న సామాజిక యాంత్రికతల సందర్భంలో వ్యక్తికి ఈ పాత్ర వాంఛనీయమే. ఒక నవలగాని, ఒక కవిత గాని కేవలం ఒక స్వగతంకాదు. రచయితకూ, పాఠకుడికీ మధ్యసంభాషణ; ఈ సంభాషణలో ఇతరు లెవరూ లేరు. రచయిత ఎంత గొప్పవాడయినా ఇక్కడ రచయితా పాఠకుడూ సమానమే. ఈ దృష్ట్యా ఒకనవల, ఒక కవిత రచయిత యొక్క, పాఠకుని యొక్క పరస్పర ఏకాకితనం నుండి ఉద్భవించిందే.

మానవచరిత్రలో ఎంతోదూరం పురోగమించాం. ఈ పురోగమనంలో మనం నడుము వరకూ మాత్రమే వచ్చాం, ఇంకా హృదయందాకా, చైతన్యందాకా, భావుకతదాకా రాలేదు. ఈ ప్రయాణం 'అసాధారణ ముఖం' వైపే. ఐదువందల కోట్లమందిమి ఉన్నా, మనిషికి కళ రూపొందించే భవిష్యత్తు తప్ప మరో భవిష్యత్తు లేదు. లేకపోతే భవిష్యత్తుకూడా భూతమే.

సాహిత్యం, ముఖ్యంగా కవిత్వం కేవలం కొద్ది మంది ఆస్తిగా ఉండడం అనారోగ్యకరమూ, ప్రమాదకరమూ. ప్రభుత్వం స్థానంలో ఒక గ్రంథాలయాన్ని పెట్టాలని నేను చెప్పడంలేదు. కాని ఈ ఆలోచన నాకనేక సార్లు కలిగింది. మనం మన నాయకుల్ని వారి రాజకీయ కార్యక్రమాల దృష్ట్యాకాక, వారి చదివే అలవాటును బట్టి ఎన్నుకున్నట్లయితే భూమిమీద ఇంత దుఃఖం ఉండేది కాదని నానమ్మకం. నాయకుడుని విదేశ విధానాన్ని గురించి కాక స్టెంథాల్, డికెన్స్, దోస్తోవిస్కీ పట్ల అతని దృక్పథాన్ని గురించి అడగాలి. ఒక తత్వశాస్త్ర సిద్ధాంతం కంటే, ఒక విశ్వాసాల వ్యవస్థకంటే సాహిత్యం నైతిక పరంగా ఎక్కువ రక్షణ కలిగిస్తుంది.

మనను మన నుండి రక్షించగలిగే చట్టాలు లేవు. సాహిత్యానికి వ్యతిరేకంగా ఒక నిజమైన నేరాన్ని నిరోధించే చట్టాలు లేవు ( రచయితల అణచి వేత, సెన్సార్‌షిప్, పుస్తకాల కాల్చివేత వంటి వాటిని మనం ఖండించినా). పుస్తకాలు చదవకపోవడమన్న ఘోరనేరాన్ని నిరోధించలేము. ఈ

నేరానికి మనిషి జీవితంలో మూల్యం చెల్లించుకుంటాడు. దేశ మయితే చరిత్రలో మూల్యం చెల్లించుకుంటుంది. రష్యాలో ఏం జరిగింది? సాహిత్యం కొద్దిమంది మేధావుల ఆస్తిగా మారి రష్యన్ సమాజం విషాద భరితమయింది. ఈ విషాదాన్ని గురించి ఎక్కువగా మాట్లాడను. కాని డికెన్స్‌ను చదువుకున్న వాడికి తన తోటి వాడిని కాల్చడానికి, డికెన్సును చదువుకోనివాడి కంటే కష్టతరమని మాత్రం చెప్పగలను. ఒక రాజకీయ సిద్ధాంతాన్ని చదివినతర్వాత చదువుకున్న మనుషులుకూడా తోటి వారిని చంపగలరు, తాము చేస్తున్నది సరయిన దేనన్న విశ్వాసంతో-. లెనిన్ చదువుకున్నాడు, స్టాలిన్ చదువుకున్నాడు, మావో చదువుకున్నాడు, పైగా కవిత్వంకూడా రాశాడు. అయితే వీళ్లందరిలో సామాన్య లక్షణం వాళ్లు చదివిన పుస్తకాల పట్టిక కంటే చంపిన వ్యక్తుల పట్టిక పొడవయినది. 1917 కు ముందు రష్యా ఉన్న స్థితి ఇప్పుడు యూరపు, అమెరికాలలో కనిపిస్తున్నది.

'ఆష్విట్జ్ అనంతరం సంగీతమెలా రాస్తారు' అని అడోర్నో అడిగాడు; రష్యా చరిత్ర తెలిసిన వాళ్లు ఇటువంటి ప్రశ్ననే అడగవచ్చు. ఎందుకంటే స్టాలిన్ కాంపుల్లో చనిపోయిన వారి సంఖ్య జర్మన్ కారాగారాల్లో చనిపోయని వారి కంటే చాలా ఎక్కువ. 'భోజన మెట్లా చేస్తావు' అని అమెరికన్ కవి మార్క్‌స్ట్రాండ్ ఒకసారి అడిగాడు. అయినా నాతరం వాళ్లు ఆ సంగీతం రాయగలమని నిరూపించారు.

ఆష్విట్జ్ స్మశానం, స్టాలిన్ నిరంకుశత్వాల పరాకాష్ట కాలంలోనే నాతరం ప్రపంచంలో అడుగు పెట్టింది. ఈ స్మశాన వాటికలో అడ్డుకొన్న దాన్ని కొనసాగించడానికేనన్నట్లు అడుగు పెట్టింది. ప్రతిదీ నిరోధించబడక పోవడానికి - కనీసం రష్యాలో - నా తరం ఒక ప్రధాన హేతువని చెప్పడానికి, నేనివ్వాళ ఇక్కడ నిలబడడానికి గర్విస్తున్నంతగా, గర్విస్తున్నాను. ఆ తరం సంస్కృతికి, ప్రపంచసంస్కృతికి చేసిన సేవకు గుర్తింపుగానే నేనిక్కడ నిలబడి ఉన్నాను. వెనక్కి తిరిగి చూస్తే మేం శూన్యంలో ఆరంభించాం. సంస్కృతి కొనసాగింపు పునర్నిర్మాణం కోసం సహజంగానే ప్రయాస పడ్డాం. కొద్దిగా మిగిలిన సాహిత్యప్రక్రియలను మా నూతన ప్రక్రియలతో పునర్నిర్మించడానికి ప్రయత్నించాం. ఇంకో మార్గం కూడా ఉన్నది. మరింత వినాశక మార్గం. విచ్ఛిన్నమయిన అలంకార సిద్ధాంతాల మార్గం. దాన్ని తిరస్కరించింది మేం కాదు. సంస్కృతే తిరస్కరించింది. ఈ ఎంపిక కూడా కళాత్మకమే కాని, నీతి సంబంధంకాదు.

ఒక వ్యక్తి తనను సంస్కృతికి ఒక సాధనంగా కాక, దాని సృష్టికర్తగా రక్షకుడుగా భావించడం సహజం. ఇవ్వాళ నేను దీనికి వ్యత్యస్తంగా అభిప్రాయపడుతున్నాను. సామాన్య భాషలో 'సరస్వతీ వాణి' అన్నది భాష నిర్దేశించిందే. భాష అతని సాధనం కాదు. భాష మనుగడకు అతనే ఒక సాధనం.

వ్యక్తి ఒక పద్యం రాయడానికి అనేక కారణాలుండవచ్చు. ప్రేయసీ హృదయాన్ని దోచుకోవడానికి కావచ్చు. చుట్టూ ఉన్న వాస్తవం పట్ల తన దృక్పథాన్ని వ్యక్తం చేయడానికి

కావచ్చు ఆ క్షణంలో తన ఆలోచనను పట్టుకోవడానికి కావచ్చు భూమిమీద ఒక గుర్తుకు మిగల్చడం కోసం కావచ్చు. కాగితం మీది నల్లటి మరకలు ప్రపంచంలో అతని స్థితిని జ్ఞాపకం చేసేవి కావచ్చు. అతను దేని కోసం కలం పట్టినా, అతని శ్రోతలపైన అది ఎటువంటి ప్రభావాన్ని చూపించినా అది ఎంతటిదైనా దాని తక్షణ ఫలితం భాషలో ప్రత్యక్ష సంబంధం కలగడమన్న ఉద్వేగం కోసమే. దానిమీద ఆధారపడిపోవడమన్న ఉద్వేగం.

ఈ ఆధారపడడం సంపూర్ణమూ, నిరంకుశమూ అయినా సంకెళ్ల నుండి విముక్తం చేస్తుంది. అతనికంటే ప్రాచీనమయినదయినా భాష తన భవిష్యత్ శక్తినంతా కలిగి ఉంటుంది. ఇది ఎంతమంది ఆ భాష మాట్లాడుతున్నారన్న అంశంమీద కాక, ఎంత గొప్ప కవిత్వం రాయబడిందన్న దానిమీద ఆధారపడి ఉంటుంది. ప్రాచీన గ్రీకు, రోమన్ రచనలు, డాంటేలను గుర్తు చేసుకుంటే ఇది అర్థమవుతుంది. ఈ నాడు రష్యన్, ఇంగ్లీషు సృష్టిస్తున్న సాహిత్యం మరో వెయ్యేళ్లకుకూడా ఈ భాషల ఉనికిని సంపన్నం చేస్తుంది. కవి ద్వారానే భాషజీవిస్తుంది. ఈ మాటలు రాస్తున్న నేను నశించి పోవచ్చు. వీటిని చదివే నీవు నశించిపోవచ్చు. కాని ఈ మాటల్ని రాసిన భాష, చదువుకున్న భాష కొనసాగుతుంది. దీనికి కారణం భాష మనిషికంటే ఎక్కువ కాలం జీవించడం మాత్రమే కాదు, అది పరివర్తన సమర్థం కూడా కాబట్టి.

కవిత రాసే వ్యక్తి ఆ కవిత తనకంటే ఎక్కువ కాలం మన్నుతుందని ఆశించినప్పటికీ కీర్తికోసమే రాయడు. భాష అతన్ని శాసిస్తుంది కాబట్టి, తరువాతి పాదాన్ని డిక్టేట్ చేస్తుంది కాబట్టి రాస్తాడు. కవిత మొదలు పెట్టేటప్పుడు అది ఎలా అంతమవుతుందో కవికి తెలియదు. అతననుకున్న దానికంటే బాగా, అతని ఆలోచనల కంటే గొప్పగా అది ఏర్పడుతుంది. అదే ఆక్షణంలోనే భాషభవిష్యత్తు వర్తమానాన్ని ఆక్రమిస్తుంది.

అవగాహనకు మూడు పద్ధతులున్నాయని మనకు తెలుసు, ఒకటి విశ్లేషణాత్మకం, రెండు స్వాభావికం, మూడు స్వయంవ్యక్తం. ఇతర సాహిత్య ప్రక్రియల కంటే విశిష్టంగా కవిత్వం ఒక్కసారే ఈ మూడు పద్ధతుల్నీ ఉపయోగిస్తుంది. ఎందుకంటే ఈ మూడూ భాషలో ఉన్నాయి. కొన్నిసందర్భాలలో ఒకే ఒక్కమాటద్వారా, ఒక్కలయద్వారా కవి తనకంటే పూర్వమెవ్వరూ అధిష్టించని స్థానాన్ని, తాను కూడా ఆశించలేని స్థానాన్ని అందుకోవచ్చు. పద్యం రాసే కవి ఆ పద్యం రాయడానికి ప్రధాన కారణం అది చైతన్యాన్ని, ఆలోచనను, ప్రపంచ అవగాహనను అద్భుతంగా వేగవంతం చేయగలుగుతుంది కాబట్టి. ఈ వేగాన్ని ఒకసారి అనుభవించి తర్వాత దీన్ని పునరుక్తం చేయకుండా ఉండగలిగే శక్తి లేదు ఇతరులు మత్తు పదార్థాలకు లొంగిపోయినట్లే అతడు దీనికి లొంగి పోతాడు. భాషకు ఇట్లా లొంగిపోయిన వాణ్ణే కవి అంటారనుకుంటాను.

# కాలంలో ప్రయాణం

- అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

కాలయానం (Time travel)ఎప్పుడూ మానవుని మేధను ఆకట్టుకొంటూనే ఉంది. హెచ్.జి.వెల్స్ రాసిన నవలలో పాత్రలు కాలంలో ప్రయాణం చేస్తాయి. ఇటువంటి కాల్పనిక సాహిత్యాన్ని కారల్ సాగన్ (Carl Sagan) ఇంకా పకడ్బందీగా రాశాడు. హాలీవుడ్ చిత్రాలు కాలయంత్రాల (Time Machines)ను సృష్టించి వాటిల్లో నాయకానాయికులను పంపుతాయి. మనదేశంలో సత్యజిత్‌రే చిత్రంలో ఆచార్య షోంకు (Professor Shonku)పాత్ర కాలవేగం అవధులను దాటి రెండుసార్లు సాహసాలు చేస్తుంది. మన తెలుగు సినిమా '' ఆదిత్య 369'' లో బాలకృష్ణ కాలంలో వెనక్కు పయనించి, శ్రీకృష్ణదేవరాయల కొలువుకు చేరతాడు. ఇదంతా కల్పన. కాని కోలోన్(Cologne)విశ్వవిద్యాలయంప్రయోగాత్మక భౌతికవిజ్ఞానశాస్త్రవేత్తగంటర్ నింట్జ్ (Gunter Nimtz) జరిపిన ప్రయోగంతో ఇప్పటి వరకు కల్పనగా భావించిన కాలయానం, నిజంగా నిజం కాబోతున్నదని చాలమంది భౌతిక శాస్త్రవేత్తలు విశ్వసిస్తున్నారు. ఇరవైసంవత్సరాలలో''కాలఅవధిని'' దాటవచ్చునని భావిస్తున్నారు.

అత్యంత సంశ్లిష్టమైన కొలోన్ విశ్వవిద్యాలయ ప్రయోగశాలలో గత సంవత్సరం మధ్యలో గంటర్ నింట్జ్ చేసిన ప్రయోగం కాలవేగాన్ని మించిన వేగంతో సంకేతాలను పంపవచ్చని రుజువు చేసింది. ఐన్‌స్టైన్ కాలవేగాన్ని సెకనుకు 186000 మైళ్ళు (మూడులక్షల కిలోమీటర్లు)గా నిర్ణయించాడు. ఆయన సాపేక్ష సిద్ధాంతం ప్రకారం ఏదీగూడ ఆవేగాన్ని మించి ప్రయాణం చేయవీలులేదు. శాస్త్ర ప్రపంచంలో అలజడి చెలరేగింది. చాలమంది శాస్త్రజ్ఞులు అనేక చోట్ల దీనిని ధృవీకరించడానికి ప్రయోగాలు చేశారు. అమెరికాలోని బెర్క్లీ విశ్వవిద్యాలయం గూడ ప్రయోగం జరిపింది. నింట్జ్ ఫలితాలను ధృవీకరించింది. మొత్తం మీద ఈ ప్రయోగాలన్నీ కొన్ని కొన్ని సందర్భాలలో కాలవేగాన్ని మించి సంకేతాలను పంపడం సాధ్యమేనని రుజువు చేశాయి.

ఇకరెండోదశఆరంభంకానుంది. కాలయంత్రంలో, మనిషిఎప్పుడు,కాలంలో గతంలోకి, భవిష్యత్తులోకి ప్రయాణించగలడు? ఈ ప్రశ్నకు సమాధానం ఇరవై సంవత్సరాలలో దొరకవచ్చునంటున్నారు. నవలలు, సినిమాలలోని పాత్రలకు ఈ కాలయానం బాగానే ఉండవచ్చు. నిజంగా మనిషి, ఒక నిజమైన కాలయంత్రంలో (Time Machine) ముందుకు, వెనక్కు పయనిస్తే,ఆ మనిషి ఏ సమస్యలను ఎదుర్కోవలసి వస్తుందోనని భయపడుతున్నారు. అప్పుడు ఉదయించే విరోధాభాస (Paradox)లను ఎలా వివరించాలా అని శాస్త్రజ్ఞులు బుర్ర గోక్కుంటున్నారు.

ఈ దిగువ విరోధాభాసలను చూడండి: ఒకడు, తండ్రి తనను ఈ సమయంలో పుట్టించి నందుకు కుపితుడై, కాలయంత్రం ఎక్కికూచుని తనుపుట్టిన తేదీ కంటె వెనక్కుపోయి, తండ్రిమీద కసి తీర్చుకుంటాడు. అస్తిత్వ వాద సమస్య ఈ విధంగా పరిష్కారమైంది.

మరొక కమ్యూనిస్టు వ్యతిరేకి, కాలంలో వెనక్కు పయనించి, మార్క్సుని చంపివేస్తే,

దస్‌కాపిటల్, కమ్యూనిజం ఉండేవి కావు. జ్యోతి బసుబహుశ కాంగ్రెసునాయకుడై ఉండేవాడు.

ఏనాడో చనిపోయిన ప్రేయసిని ఒకడు కాలంలో వెనక్కు పోయి ముద్దు పెట్టుకోవచ్చు. ఇటువంటి విరోధాభాసలు కారణంగా కాలయానం అసాధ్యం అని శాస్త్రజ్ఞులు విశ్వసించారు. సాపేక్షవాద శాస్త్రవేత్త ఎ.కె. రాయ్‌చౌధురి ఇలా అంటున్నారు: ''కాలయానం ఎప్పటికీ సాధ్యం కాదనే నా అభిప్రాయం. నాకీ అభిప్రాయం ఎందుకు ఉందో నేను చెప్పలేను. బహుశా మూఢవిశ్వాసం కారణం కావచ్చు. అయినా కాలయానం సాధ్యమని నేను విశ్వసించను. సమస్య ఏమంటే, మనం కాలంలో ప్రయాణం చేయగలిగితే, ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్రం మొత్తం కుప్పకూలిపోతుంది''. కాని ఇతని స్నేహితుడు కాలిఫోర్నియా టెక్నాలజీ ఇన్స్టిట్యూట్‌లోని ఆచార్యుడు కిప్ థోరన్(Kip Thorne) ఇతనితో ఏకీభవించడంలేదు. కాలయంత్రాలు తప్పకుండా సాధ్యాలే అంటున్నాడు. ఐన్‌స్టైన్ అయితే కాలయంత్రాలు సాధ్యాలు కావనే అన్నాడు.

కాలయంత్రాల గురించి నిర్దుష్ట అభిప్రాయాన్ని వెలిబుచ్చిన వాడు కిప్ థోరన్. 1980ల్లో సాగన్ (sagan) దూరగ్రహవాసులతో సంపర్కం పెట్టుకొనే విషయం పై రాస్తున్న ''సంస్పర్శ'' (contact) అనే గ్రంథం శాస్త్ర బద్ధతను పరీక్షించాడు. ఈ సందర్భంలో థోరన్ కాలయానంమీద ప్రసిద్ధ ''ఆలోచనా ప్రయోగా'' (thought experiment) న్ని జరిపి అనేక అపోహలను తొలగించాడు.

ఆరోజుల్లో ఒక పాలపుంతనుంచి మరోపాలపుంతకు, మధ్య దూరాన్ని గమించకుండానే, ''కాలబిలం'' (black hole) లోకి లంఘించడం ద్వారా, చేరవచ్చు అని భావించారు. సాగన్ ఇదే భావనతో ముందుకు సాగాలనుకొన్నాడు. కాని థోరన్ అడ్డుకొని ''అదికుదరదు'', అన్నాడు.

ఒక నక్షత్రం శిథిలమై కుప్పకూలినప్పుడు, అనంత గురుత్వాకర్షణ శక్తి గలిగిన అత్యంత సాంద్రతర బిందువుగా అది కేంద్రీకృతమవుతుంది. ఇది కాలబిలం ఏర్పడేతీరు. ఏదేని వస్తువు ఈబిలం దగ్గరగా వెళ్ళినప్పుడు దానిని అనంతశక్తితో అది లోపలికి గుంజుతుంది. దాని దగ్గరకు వెళ్ళింది ఏదీ దాని నుంచి తప్పించుకోలేదు. నాశనమై తీరవలసిందే. అందుకని కాలబిలానికి బదులు క్రిమిబిలా(worm hole)న్ని ప్రవేశపెట్టమని థోరన్, సాగన్‌కు సూచించాడు. అప్పటినుంచి క్రిమిబిలాలు శాస్త్రీయ కాల్పనిక సాహిత్యంలో భాగం అయ్యాయి.

క్రిమి బిలం అంటే ఏమీ లేదు, ఈ విశ్వంలో అణువుల మధ్య ఉండే ఆకాశంలో బుడగలు (bubbles) ఉంటాయని, ఆ బుడగలలో ఎప్పుడో ఒకసారి రెండు బుడగలు కలియడంతో ఒక సొరంగం (tunnel) ఏర్పడుతుందనీ, థోరన్ గురువైన ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ వీలర్ ప్రతిపాదించాడు. ఈ సొరంగాన్నే గమ్మత్తుగా 'క్రిమిబిలం' అంటారు.

అత్యంత వేగవంతమైన ప్రయాణాన్ని అనుమతించే అటువంటి క్రిమిబిలం లభ్యమైతే, వాటిని కాలంలో వెనక్కుపోయే కాలయంత్రాలుగా మార్చవచ్చు అన్నాడు థోరన్. ఈ మాట అతడు సరదాకు అనలేదు. ఒక ముఖం ఇక్కడ, మరో ముఖం మరోచోట ఉన్న క్రిమిబిలం మనకు దొరికితే సొరంగం లోపల గుండా కాలానికి కొక్కెం వేసే మూడు సంభావ్యతలు ఉన్నాయి. మొదటిది: ఒక ముఖంలో ప్రవేశించిన వాడు అదే సమయంలో (Simultaneously)

రెండో ముఖం నుంచి బయటికి రావచ్చు. రెండోది: అతడు కొంచెం ఆలస్యంగా రెండోముఖం నుంచి బయటికి రావచ్చు. మూడోది: మొదటి ముఖంలో ప్రవేశించక ముందే రెండో ముఖం నుంచి బయటకు రావడం. ఇలా చెప్పడం చాల సాహసోపేతమైన విషయం. స్టీఫెన్ హాకింగ్ ఏమంటున్నాడంటే, ''కాలంలో ప్రయాణం మీద పరిశోధనలు జరిపే శాస్త్రవేత్త చాల జాగ్రత్తగా ఉండాలి. అతనిని ఎవరూ పిచ్చివాడని ముద్రవేయకుండా చూసుకోవాలి. ప్రజల సొమ్మును దుబారా చేస్తున్నాడనే వాదు రాకుండా చూసుకోవాలి. అయినా అది నిజంగా పరిశోధించాల్సిన సమస్యే''.

ప్రొఫెసర్ గంటర్ నింట్జ్, తన సొరంగ ప్రయోగం (tunnel experiment) ద్వారా కాంతివేగం కంటె వేగంగా సంకేతాలను పంపవచ్చు అని రుజువు చేశాడు. ఈ ప్రయోగాన్ని అతడు విద్యుదయస్కాంత తరంగాలతో చేశాడు. ప్రపంచంలో శాస్త్రవేత్తలంతా విస్తుపోయి బుర్ర గోక్కున్నారు. ''అది వాళ్ళకర్మ. కావాలంటే వారినీ ప్రయోగాలు చేసి తప్పని రుజువు చేయమనండి'', అన్నాడు.

మీరు ఈ ప్రయోగాన్ని ఎలా భావన చేశారని ప్రశ్నిస్తే , ''అది నాకు యాదృచ్ఛికంగా తట్టింది'', అన్నాడు. ''మీ ప్రయోగాన్ని వివరించండి'', అని అడిగితే, ''అదేముంది, చాల సరళమైన విషయం. నాకో చిన్నగది ఉంది. దానిగుండా 'గుళికా సొరంగ పద్ధతి' (Quantum tunnelling Method)లో విద్యుదయస్కాంత వికిరణాన్ని (electromagnetic radiation) పంపాను. అంతే ఈ ఫలితాలు వచ్చాయి. ఈ ప్రయోగం జగదీశ్ చంద్రబోస్ జరిపిన ద్వంద్వ పట్టక ప్రయోగం (Double Prism Experiment) లాంటిదే. మీకు బోస్ తెలుసనుకొంటాను. ఆయన కలకత్తాలో పని చేశారు. ఒక గొప్ప ప్రయోగాత్మక శాస్త్రజ్ఞుడు. బోస్ ప్రయోగం ''కాంతి-దృష్టి''కి సంబంధించింది. నాది గుళికా యాంత్రికశాస్త్రానికి (Quantum mechanics) సంబంధించింది'', అన్నాడు.

''మీకు'' కాలంలో ప్రయాణం మీద ఆసక్తి ఉందా''? అని అడగితే, ''లేదు'' అన్నాడు. నేను ఒక ప్రయోగాత్మక శాస్త్రజ్ఞుణ్ణి. నేను ఒక కొత్తరకం ''ప్రతి-ప్రతిధ్వని గది'' (anti-echo chamber)ని తయారుచేశాను. దీనిని విద్యుదయస్కాంత తరంగాలకు ఉపయోగించవచ్చు. దీనిని విమానాల తయారీదారులు ఉపయోగించుకొంటున్నారు. అసలు ప్రయోగాన్ని నేను అనుకోకుండా చేశాను.''

''భౌతిక శాస్త్రవేత్తలు ఎప్పటికైనా కాలయంత్రాన్ని (Time machine) తయారు చేయగలరా?'' అని అడిగినప్పుడు, ''నా ప్రయోగం మీద ఆధారపడి అయితే మాత్రం కుదరదు. కొద్ది దూరాలకే నా ప్రయోగం పరిమితం. పెద్ద దూరాలకు అనుప్రయుక్తం చేయాలంటే ఎంతో శక్తి (energy) కావాలి. కావాలంటే ఇప్పుడు కొన్ని చిన్న చిన్న గమ్మత్తులు చేయవచ్చు. ఒక కంప్యూటర్, కాలిక్యులేటర్ వేగాన్ని పెంచవచ్చు'', అన్నాడు.

శాస్త్రానికి నిరాశ, విశ్రాంతులు అనేవి లేవు. తన ప్రయత్నం అది చేస్తూనే ఉంటుంది. మానవుని జ్ఞానం పెంచుతూనే ఉంటుంది. చేసినదాని కంటె చేయవలసింది ఎప్పుడూ ఎక్కువగానే ఉంటుంది. ''కాలంలో ప్రయాణం'', త్వరలోనే సాధ్యమని ఆశిద్దాం.

– ది స్టేట్స్ మన్ సౌజన్యంతో

# వ్యావహారిక భాషా వాదం - గిడుగు రామమూర్తి

– డా॥ గిడుగు వేంకట సీతాపతి

(ఆగష్టు 29 డా. గిడుగు జన్మదిన సందర్భంగా ఈ అముద్రిత రచనను ప్రచురిస్తున్నాము)

వ్యావహారిక భాషావాదము ఎప్పుడు, ఎట్టి పరిస్థితులలో పుట్టి విజృంభించినదో, ఇందులో మా నాన్నగారు గిడుగు రామమూర్తిగారి కృషిఎట్టిదో, ఎంతవరకు సఫలమైనదో ఈ తరమువారికి లెస్సగా తెలియదు. ఈ వాదము పుట్టిన నాటి నుండిన్ని దీనితోడి సంబంధము అంతకంతకు ఎక్కువగుతూ వచ్చిన వాడను గనుక ఈ వాదము గురించి తెలియజేస్తున్నాను.

వైస్రాయ్ కర్జన్ ప్రభువు నియమించిన ఎడ్యుకేషనల్ కమీషన్ నివేదిక 1905లో ప్రకటితమయినది. అందులో బీ.ఏ., ఎమ్.ఏ పరీక్షలలో ఉత్తీర్ణులయినవారు తాము నేర్చుకొన్న ఆధునిక శాస్త్ర విజ్ఞానమును తమ మాతృభాషలో చెప్ప లేకుండా ఉన్నారనిన్ని అందుకు కారణము తాము నేర్చుకొన్నది ఫస్ట్‌ఫారం నుండిన్ని ఆంగ్ల భాష ద్వారానే అయినదనిన్ని తేలినది. దీనిని బట్టి విద్యా విధానములో మార్పులు గలిగినవి. మెట్రిక్యులేషన్ స్థానమందేర్పడిన స్కూల్ ఫైనల్ విద్యార్థులున్ను, ఎఫ్.ఏ స్థానమందేర్పడిన ఇంటర్‌మీడియట్ విద్యార్థులున్ను విధిగా మాతృభాషలో వ్యాసరచన, ఆంగ్లవచనమునకు మాతృభాషలో అనువాదమున్ను చేయవలెనన్న నియమము ఏర్పడినది. సరిగా ఆ సమయమందే అనగా 1906లో గంజాం, విశాఖపట్టణం, గోదావరి జిల్లాలకు విద్యాశాఖోద్యోగిగా నియమితులయిన జే.ఏ.యేట్సుదొర పుస్తకాలలో వున్న తెలుగు భాషకున్న వ్యవహారమందున్న తెలుగు భాషకున్ను చాలా వ్యత్యాసమున్నందుకు ఆశ్చర్యపడి అందుకు కారణమేమని వారు పండితులను విశాఖపట్టణం ఏ.వి.ఎన్.కాలేజీ ప్రిన్సిపాలుగా నుండిన పీ.టీ.శ్రీనివాస అయ్యంగారిని ప్రశ్నించారు. ''వాడుక భాష గ్రామ్యం; గ్రంథరచనకు పనికిరాదు. వాచకములలోని భాషగ్రాంథికం, సలక్షణమైన భాష'' అని పండితులు చెప్పారు. ''నేను అరవవాడను. నేనంతగా చెప్పలేను. మీరు విజయనగరం వెళ్లినప్పుడు గురుజాడ అప్పారావుగారిని, పర్లాకిమిడి వెళ్లినప్పుడు గిడుగురామమూర్తిగారిని కలుసుకొని సంప్రదించండి; వారు చెప్పగలరు'' అని అయ్యంగారు చెప్పారు. వారి సలహాను అనుసరించి యేట్సు దొర అప్పారావు గారిని విజయనగరం లోను, రామమూర్తిగారిని అనగా మా తండ్రిగారిని పర్లాకిమిడిలోను 1906లో కలుసుకొని సంప్రదించారు. ''పద్యాలు, పాటలు రచించినప్పుడు కొద్దిగా కావ్యభాషలోని ప్రయోగాలు రసపోషణ కోసం ప్రయోగిస్తూ ఉంటాను. కాని, వచనం మాత్రం వాడుకభాషలో సాగిస్తాను. అందులోను నాటకాలకు పాత్రోచితమైన భాష రసవంతంగా ఉంటుందని నా అభిప్రాయం. అందుచేత నాకన్యాశుల్కం నాటకాన్ని పాత్రోచితమైన వాడుక భాషలో రచించాను. పండితులతో వాదం పెట్టుకొన్న ప్రయోజనం లేదని నెమ్మదిగా నా పని నేను సాగించుకొంటున్నాను. మీ స్కూళ్లలోను కాలేజీలలోను తమ రచనలను పాఠ్యగ్రంథములుగా పెట్టించుకొనదలచిన వారు పిల్లల ''బాలబోధనల''నైనా ఆ కావ్య భాషలో వ్రాయాలి, లేకపోతే మీ వంటి విద్యాధికారులు సమ్మతించరు. ఇంతకూనేనిప్పుడు ఉపాధ్యాయుడను కానుగనుక నామాట చెల్లదు. పర్లాకిమిడిలో నాస్నేహితుడు గిడుగురామమూర్తి ఉపాధ్యాయుడుగా ఉన్నాడు. భాషాతత్త్వము చదువుకొన్నవాడు, అతనితో సంప్రదించండి'' అన్నారు అప్పారావుగారు.

''నేను భాషాతత్త్వము కొద్దిగా చదువుకొన్నవాడనే కాని, తెలుగు సాహిత్యంగాని, వ్యాకరణాలుగాని అంతగా చదువుకొన్నవాడను కాను; కవినీ కాను, గ్రంథకర్తనూ కాను. కాని, పుస్తకాలలోని భాషకున్ను వాడుకలో ఉన్న భాషకున్ను మరియే ఇతర భాషలలోను లేనంత వ్యత్యాసం ఎక్కువగా తెలుగు భాషలో ఎందుకున్నది? అనే ప్రశ్నగురించి నేనూ ఒకప్పుడు ఆలోచించాను గాని ఏదో ఇతర కార్యాల ఒత్తిడి ఎక్కువగా ఉండడంవల్ల నేనంతగా పరీక్షించలేదు. ఇప్పుడు మీరీ ప్రసంగం చేశారు గనుక ఆలోచించి చెప్తాను'' అన్నారు మా తండ్రిగారు.

**మొదటి ఘట్టము:-** ఆనాటినుండిన్నీ మా తండ్రిగారు భాషాతత్త్వగ్రంధాలు, తెలుగు వ్యాకరణాలు, కావ్యాలు తీవ్రంగా చదివి తెలుసుకొన్న విషయాలు 1909లో విశాఖపట్నమునందు యేట్సు యాజమాన్యాన జరిగిన ఉపాధ్యాయుల మహాసభలో తెలియజేశారు. ఆవిషయాలను ఇక్కడ క్లుప్తంగా తెలియజేస్తాను:-

1. ''కేవలం గ్రంధములందేకాని నిత్యవ్యవహారములో లేని లాటిన్ గ్రీక్ సంస్కృత భాషలు మారకుండా ఉంటవిగాని నిత్యవ్యవహారములో ఉన్న జీవద్భాషలు సదామారుతూనే ఉంటవి. మన తెలుగు భాష జీవద్భాష. అందుచేత నన్నయకాలమున ఎట్లుండెనో అట్లే ఉండిపోలేదు. అనేక శబ్దరూపాలలోను, కారకంలోను, నుడికారంలోను మార్పులు కలిగినవి. ప్రాచీన కావ్యాలలో ఉన్న రూపాలు కొన్ని అర్వాచీన కావ్యాలలో కనబడవు. అందులో లేని రూపాలు కొన్ని ఇందులో కనబడుతవి.''

2. ''మనపూర్వులు రచించిన వ్యాకరణాలు కావ్యభాషకే కాని వ్యావహారిక భాషకు ఉద్దేశించినవి కావు. రానురాను రచితములైన వ్యాకరణాలలో అర్వాచీన కావ్యాలలోని క్రొత్త ప్రయోగాలు కొన్ని మాత్రమే చేర్చుకోవడం జరిగింది.''

3. ''సంస్కార మంటే శుద్ధిచేయడమని అర్థంచెప్పి బట్టల విషయంలో చాకలి చేసే పని శబ్దముల విషయంలో వైయాకరణుడు చేస్తాడన్నట్లుగా కొందరు పండితులు చెప్తున్నారు. అది సరికాదు. సంస్కార శబ్దము వ్యాకరణ పరిభాషలో ఒకవిశిష్టార్థముగల శబ్దము. లోకములో ఉన్న శబ్దరూపమును, ఉన్నది ఉన్నట్లు, గ్రహించి, దానికి ప్రక్రియచెప్పవలసిన వాడే కాని ఉన్నదానికి మలినత్వము పోగొట్టి శుద్ధిచేసే వాడుకాడు వైయాకరణుడు.''

4. ''గ్రామ్యమనే శబ్దానికి కూడా విపరీతార్థాలు చెప్తున్నారు పండితులు. గ్రామశబ్దమునుండి వచ్చిన ఈ మాటలకు అనాగరకము, పామరము, అసభ్యము అనే అర్థాలు లోకంలో రూఢిగా ఉన్నవి. లక్షణవిరుద్ధమైన భాష 'గ్రామ్య' మని కొందరున్ను, 'చ్యుతసంస్కార' మని కొందరున్ను అన్నారు. గ్రామ్యములో నింద్యగ్రామ్యము, అనింద్యగ్రామ్యము కలవన్నారు కొందరు. దుష్టమైనను ఆర్యులవ్యవహారము గ్రాహ్యమేనన్నారు కొందరు. వ్యాకరణ పరిభాషలో గల మాటలకు లోకంలోగల అర్థాన్ని ఆరోపింపజేసి, ''గ్రామ్యభాషను గ్రంథాలలోనికి ఎక్కనీయరాదు; బహిష్కరించాలి; ఈ గ్రామ్యవాదులు మధురమైన మనతెలుగు భాషను చెడగొట్టాలని చూస్తున్నారు. మన గ్రాంథిక భాషను మనం సంరక్షించుకోవాలి'' అని సభలో కేకలు వేసి మాటలాడే వారు

దురహంకారంతోను, దురభిమానంతోను మాట్లాడుతున్నారే కాని, తామేభాషలో మాటా డుతున్నారో చూచుకోకుండా అన్నారు. అది గ్రామ్యమా? గ్రామ్యమయితే అనింద్యమా? అనింద్యమయితే కావ్యాలలో ప్రయోగించవచ్చునన్నారు వైయాకరుణులు. నింద్యమైతే అసభ్యమన్నమాట. అసభ్యం సభలలో మాటలాడకూడదు. గ్రాంథిక వాదులందరూ ఇంటాబయటా సభలలోను ఎట్లు మాటాడుతున్నారో నేనున్ను అట్టే మాటాడుతున్నాను. కనుక మనం అంతా ఒక విధమైన భాషే మాటాడుతున్నాం. మన భాష అసభ్యమైనది కాదు. నింద్యమైన గ్రామ్యంకాదు; వ్యావహారిక భాష, వాడుక భాష. కనుక మీరు ఔదార్యం గలవారయితే మమ్మ గ్రామ్యవాదులనరాదు; వ్యావహారిక భాషావాదులనాలి. మేముద్ధరింపదలచినది వ్యావహారిక భాషేకాని గ్రామ్యభాషకాదు.

5. ''దేశంలో అక్షరాస్యులు నూటికి 10కంటె ఎక్కువమంది లేరు. ఈ స్వల్పసంఖ్యాకులయిన అక్షరాస్యులలో నూటికి ఒక్కరైనా కావ్య భాష అర్థంచేసుకోగల వారున్నారోలేదో సందేహం. ఇట్టి పరిస్థితులలో విద్యావ్యాప్తికి పూనుకోదలచిన పెద్దలు ఏ భాషలో కథలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, ప్రకటనలు మొదలయినవి రచిస్తే మంచిదో ఆలోచించాలి. కావ్య భాష అల్పప్రయోజనము, పరిమిత ప్రయోజనము కలది; కనుక, వ్యావహారిక భాషలో రచితములైన గ్రంథాల వల్లనే విద్యావ్యాప్తి ఎక్కువగా సాగగలదని నా అభిప్రాయం. ఉన్నత పాఠశాలలోను కళాశాలలోను నన్నయ మహాభారతం మొదలుకొని నేటికాలం వరకుగల కావ్యాలను విద్యార్థుల చేత చదివించండి, వద్దనలేదు; కాని, ఆ కావ్యభాషలోనే వచన రచన నిర్బంధముగా సాగించాలన్న పట్టుదల విడిచి పెట్టండి''.

ఈ విధంగా వీరి ఉపన్యాసం సాగినది. అయినా, సభలో ఉన్నవారిలో ఏ ఇద్దరు ముగ్గురో వీరి మాటలు అర్థంచేసుకొన్నారు. తక్కిన వారందరూ ఏదో ఘోరమైన ఆపద తెలుగుభాషకు కలుగుతూ ఉన్నదన్నట్లుగా ఆలోచించారు.

యేట్సు దొరగారు, మా తండ్రిగారి ఉపన్యాసానికి పూర్వమే కొద్దిగా తమ ఆంగ్లవాఙ్మయ విషయం తెలియజేసి మా తండ్రిగారిని ప్రసంగించమన్నారు. దొరగారు చెప్పినదేమంటే: ''మా భాషలో ప్రాచీన కావ్యాలు, మధ్య యుగమందలి కావ్యాలు, ఆధునిక కావ్యాలు ఉన్నవి. వాడుక భాషననుసరించి కావ్యభాషకూడా మారుతూ వచ్చింది. నేటి మావచన రచనలన్నీ నేటి శిష్టజన వ్యావహారిక భాషలోనే ఉన్నవి. ఉన్నత శ్రేణిలో ఉన్న విద్యార్థులు ప్రాచీనకావ్యాలు చదువుకొంటారు. చిన్న తరగతి పిల్లలు మాత్రం వ్యావహారిక భాషలో ఉన్న గ్రంథాలేచదువుకొంటారు. పాఠ్యగ్రంథాలు ఏ భాషలో ఉన్నా వ్యాసరచన మాత్రం ఆధునిక భాషలోనేసాగుతూ ఉంటుంది. అంతేకాదు, వ్యవహార భ్రష్టమైన ప్రాచీన రూపాలు నేటి రచనలలో అందులోను వచన రచనలో సాగకూడదు అన్న నియమం కూడా ఉన్నది. పద్యరచనలో మాత్రం రసపోషకములైన ప్రాచీన భాషా రూపాలు కొద్దిగా ప్రయోగించడం జరుగుతూ ఉంటుంది. మీ తెలుగు భాష విషయం నాకు తెలియదు కనుక ఈ భాషా విషయం లెస్సగా కృషిచేసిన గిడుగు రామమూర్తిగారిని ప్రసంగించవలసినదిగా కోరుతున్నాను, అని చెప్పారు.

యేట్సుదొరగారి సమక్షమున జరిగిన సభలో వారి యెదుట నేమీ అనలేక ఉపాధ్యాయులు ఇతరత్ర గుసగుసలాడి మాతం(డిగారిని వేరే కలుసుకొని ప్రసంగించారు. వారికి సమాధానములు చెప్పి, వారిని లొంగదీసుకొనుటకు మాతం(డిగారు తాము తమవాదమునకు అనుకూలముగా నుండే విషయాలను కావ్యాలనుండిన్ని, వ్యాకరణములనుండిన్ని ఎత్తి చూపించారు. ఏదైతేనేమి? పండితులకు వీరివాదము నచ్చలేదు. ''గ్రామ్యభాష''ను బడులలో ప్రవేశపెడితే తమ ఆధిక్యం మరి ఉండదనిన్ని, ఇంగ్లీషుముక్కలు నాలుగు చదువుకొన్నవారే తెలుగు పాఠాలు చెప్తారనిన్ని తమ ఉద్యోగాలు పోతవనిన్ని భయపడ్డారు. 'ప్రాచీన కావ్యాలు పాఠ్యగ్రంథాలుగా ఉంటవి; వాటిని బోధించడానికి పండితులు కావలెను, మీకేమీ భయముండనక్కరలేదు' అని మాతం(డిగారు ఎంతచెప్పినా, 'సంఘాచారాలు మారిపోతున్నవి; విద్యావిధానాలు మారిపోతున్నవి. అంతా మాలకూడయిపోతున్న' దన్న భయము పండితులకు విపరీతముగా పట్టుకొన్నది.

**రెండవ ఘట్టము:-** దీనికితోడు మరియొక మార్పు సరిగా ఆ సమయానికే వచ్చింది. 1903 లో వైస్‌రాయిగా ఉండిన కర్జన్‌ప్రభువు ఏర్పరచిన ఒక విద్యా సంఘము వారు దేశమందలి విద్యావిధానమెట్లున్నదో పరిశీలించి ఒక నివేదిక తయారుచేసినారు. అందులో ''విశ్వవిద్యాలయములు పుట్టి సుమారు 50 సంవత్సరములయినది. వందలకొలదిగా పట్టభద్రులు ప్రతి మండలమందున్ను తయారయినారు. అయినా దేశమందలి అక్షరాస్యులసంఖ్య సగటున నూటికి 10కంటె ఎక్కువకాలేదు. వయోజన విద్యావిధానము సాగించి ప్రజావాఙ్మయం పుట్టిద్దామా? అనే ప్రశ్నకు తృప్తికరమయిన సమాధానములు విద్యాధికులనుండి రావడంలేదు. పాశ్చాత్యవిద్యల నభ్యసించిన పట్టభద్రులు తాము నేర్చుకొన్న నవీన శాస్త్రవిషయములు ప్రజలకు ప్రజలభాషలో బోధిస్తే బాగుండును. కాని, ఈ పట్టభద్రులు తామునేర్చుకొన్నదంతా ఆంగ్లభాష ద్వారా నేర్చుకొని ఉండడం చేత ''తప్పో ఒప్పో ఆంగ్లభాషలో బోధపరచగలముకాని, మా మాతృభాషలో బోధపరచలే'' మంటున్నారు. ఇది విపరీతమయిన దురవస్థ; దీనిని తొలగించుటకు ప్రభుత్వ విద్యాశాఖావారున్ను, విశ్వవిద్యాలయములవారున్ను చేయవలసిన పనులేమంటే ప్రాథమిక పాఠశాలలోనే కాక ఉన్నత పాఠశాలలలోకూడా భాషేతర విషయములన్నీ మాతృభాష ద్వారానే బోధించవలెనన్న విధానము ప్రవేశపెట్టవలెను. అంతేకాక ఉన్నత పాఠశాలలలోను, కాలేజీలలోను మాతృభాషలో వ్యాసరచన విద్యార్థులకు అలవడజేయవలెను,'' అనే సలహాలు ఆ సంఘంవారి నివేదికలో ఉండెను. వాటిని అనుసరించి మద్రాస్ రాష్ట్రములో కూడా ప్రభుత్వ విద్యాశాఖ వారి యాజమాన్యమున గల ఉన్నత పాఠశాలలలోను, విశ్వవిద్యాలయంవారి యాజమాన్యమున గల కాలేజీలలోను ఉండిన విద్యావిధానము మార్పు చెందినది. మెట్రిక్యులేషన్ పరీక్షకుమారుగా స్కూల్‌ఫైనల్ పరీక్ష, ఎఫ్. ఏ పరీక్షకు మారుగా ఇంటర్ మీడియేట్ పరీక్ష 1911లో అమలులోనికి వచ్చినవి. 1909నుండిన్ని ఈ నూతన విధానమును గురించి ఆలోచనలు, చర్చలు జరుగుతూవచ్చినవి. 1910లో యేట్సు దొరగారు విశాఖపట్టణంలో ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయుల సభను సమావేశపరచారు. సరిగా అప్పుడేనేను జయపురం ఉన్నతపాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా నియమితుడనగుట చేత నేనున్ను ఆ సమావేశంలో పాల్గొన్నాను.

తక్కిన అనేక విషయములతో పాటు స్కూల్‌ఫైనల్ పరీక్షకు నిర్బంధముగా పెట్టనున్న తెలుగు వ్యాసరచన ఎట్టి భాషలో నుండవలెనన్న విషయం చర్చకు వచ్చినది. ''ఈ విషయం గురించి మీ సలహా ఏమి?'' అని మా తండ్రిగారిని యేట్సు దొరగారు అడిగారు. వ్యాసరచన, శిష్టజనవ్యావహారిక భాషలో ఉండవలెనని వీరు నొక్కిచెప్పారు. ఆ సమావేశములో పండితులు లేరు కాని తెలుగు పాండిత్యం కొద్దిగానో గొప్పగానో కల ప్రధానోపాధ్యాయులు కొందరుండిరి. యేట్సు దొరగారి సమక్షంలో అంత తీవ్రముగా ఎదిరించలేక పోయినా వారు వ్యావహారిక భాష పనికి రాదన్నారు. ఒక గంటసేపు చర్చసాగిన తర్వాత ఒక సమాధానానికి ఇరుపక్షములవారున్ను ఒప్పుదల కుదుర్చుకొన్నారు. పరీక్షలో విద్యార్థులు వ్యావహారిక భాషలో గాని, గ్రాంథిక భాషలో గాని తమ వ్యాసములు వ్రాయవచ్చును అనే స్వేచ్ఛ విద్యార్థులకు కలిగించడానికి సమ్మతించారు. వ్యావహారిక భాషలో ఆదర్శప్రాయంగా ఉండే రచనను సూచించే వచన గ్రంథము ఒకటి పాఠ్యగ్రంథముగా చూపించ వలసిన ఆవశ్యకత కలిగినది. అట్టి పరిస్థితులలో విశాఖపట్టణంలో కవిగాను రచయితగాను కొంతపేరు పొందిన సెట్టి నరసింహంగారు వ్యావహారిక భాషావాదుల సలహా ప్రకారం 'గ్రీక్ మిత్తులు' (తాతలనాటి పాతకథలు), 'వసంతసేన' అనే వచన రచన గ్రంథాలు రచించారు. అందులో ఒకటి స్కూల్‌ఫైనల్ పరీక్షకు పాఠ్యగ్రంథముగా విద్యాశాఖవారు నియమించారు. దానితో తెలుగు దేశమంతటా పెద్ద కలవరం పుట్టింది. వాస్తవంగా ఆ గ్రంథాలలో వాడుకభాష చాలా తక్కువ. అది వ్యావహారిక భాషలో రచితమయినదంటే నేటి రచయితలు నవ్వుతారు. ఆనాటి రాజకీయ వాతావరణంలో బ్రిటిష్ ప్రభుత్వం వారికి ''వందేమాతరం'' అంటే రాజద్రోహంగా తోచినట్లు ఆనాడు కొద్దిగా ప్రాచీన శబ్దరూపాలను మార్చి రచించిన ఆ పుస్తకాలు కూడా ''గ్రామ్య'' భాషలో రచితములైనవన్న అభిప్రాయం కలిగింది, పండితులకు. ఆ పుస్తకాలను ఆ విద్యావిధానాన్ని ప్రతిఘటిస్తూ పెద్దలనేక స్థలములలో సభలు సమావేశపరచి తీర్మానాలు చేసి, ప్రభుత్వానికి మహజర్లు పంపించారు. ఆ పుస్తకాలలోని భాషకంటె ఆ పుస్తకాలకు ఉపోద్ఘాతంగా వ్రాసిన పి. టి. శ్రీనివాస అయ్యంగారి మాటలు ఎక్కువగా బాధకలిగించినవి. అతడు అదివరకు ''భాష-చావు, బ్రతుకు'' అనే పేరను జీవద్ భాషలకును నిర్జీవ భాషలకును గల తారతమ్యము వివరిస్తూ ఒక పత్రికను ఇంగ్లీష్ భాషలో రచించి ప్రకటించాడు. అతడు తన అభిప్రాయాలను సంగ్రహంగా ఈ ఉపోద్ఘాతంలో వెల్లడించాడు. అదీ ఎక్కువగా గ్రాంథిక వాదుల అహంకారానికి గురి అయినది.

ఇటువంటి సభలు తీర్మానాలు చేస్తూ మహజర్లు పంపుతూ వచ్చినా, ప్రభుత్వ విద్యాశాఖాధికారులు గ్రాంథిక వాదులకు లొంగలేదు. నాలుగు సంవత్సరాలపాటు వ్యాసరచన, ఆంగ్లమునుండి తెలుగులోనికి అనువాదము-రెండున్నూ వ్యావహారిక భాషలో వ్రాయడానికి విద్యార్థులకు స్వేచ్ఛ కలిగించారు. వ్యావహారిక భాషలో వ్రాయడానికైనా శిక్షణ కావలెనన్న విషయం గ్రహించక కొందరున్ను, గ్రహించిన్ని అది ఎంత పాడుగా అంటే అంతరోత పుట్టించ వచ్చునన్న దురుద్దేశంతో కొందరున్ను పాఠశాలలో విద్యార్థులకు రచనా విధానము బోధించక ''మీ ఇష్టం వచ్చినట్లు వ్రాయండి, మీ రెంత పచ్చిగా వ్రాస్తే అంత ఎక్కువగా మార్కులు వస్త''వని కూడా

హెచ్చరించారు. విద్యార్థులు వ్రాసిన వ్రాతలను కనబరచి ''చూడండి ఎంత దిక్కుమాలిన భాషలో రచనలు సాగుతున్నవో'' అని ఉద్ఘోషించే దురుద్దేశముతో చేయకూడని పనులు కూడా చేశారు కొందరు.

పిఠాపురం మహారాజా వారి పోషణతో 1911లో స్థాపించబడిన ఆంధ్రసాహిత్య పరిషత్తు ఈ వ్యావహారిక భాషావాదమును పడగొట్టుటకు పూనుకున్నది.

కర్జన్ నివేదికను అనుసరించి మద్రాస్ విశ్వవిద్యాలయం వారు కూడా ఇంటర్‌మీడియేట్, బి. ఏ. పరీక్షలకు తెలుగువ్యాసరచనగాని, సంస్కృత భాషలో ఉన్నది ఆంగ్ల భాషలోనికి పరివర్తనం చేయడంగాని విద్యార్థులందరున్ను నేర్చుకోవలసిన విషయంగా నిర్ణయించారు. ఆ తెలుగు వ్యాసరచన ఎట్లుండవలెను? అందుకు ఆదర్శప్రాయంగా ఎటువంటి గ్రంథములను పాఠ్యగ్రంథములుగా నిర్ణయించవలెను? అనే విషయములు నిర్ణయించుటకు, ఆ విద్యార్థులు తమ వ్యాసరచన, అనువాదము ఏ భాషలో వ్రాయవలెను? గ్రాంథికములోనా? వ్యావహారికములోనా? అనే విషయమును నిర్ణయించుటకును 1913లో ఒక సలహా సంఘమును మద్రాసు విశ్వవిద్యాలయం వారు నియమించినారు. అందులో నలుగురు గ్రాంథిక భాషా పక్షమువారు, నలుగురు వ్యావహారిక పక్షమువారు, మధ్యవర్తులు ఇద్దరు ఉండిరి. ఈ మధ్యవర్తులలో తాంప్సన్ దొర సంఘసమావేశ కర్తగాను, ప్రొఫెసర్ రంగాచార్యులు అధ్యక్షులుగాను నియమితులైనారు. చర్చలు విరివిగా సాగినవి. తుదకు వ్యావహారిక భాషావాదమునకు అనుకూలముగా తీర్మానము నెగ్గినది. వ్యావహారిక భాషా పదముల పట్టిక తయారు చేయవలసి యుండినది. ఆ తీర్మానమును పడగొట్టుటకు గ్రాంథిక భాషావాదులు ఒక పన్నుగడ పన్నినారు. ఈ సలహా సంఘములో రాయలసీమ ప్రతినిధులెవరూ లేరు. అక్కడి వ్యావహారిక భాషా పదములు చేర్చవలెను గనుక రాయలసీమ ప్రతినిధులను ఈ సంఘములో సభ్యులుగా నియమించవలెనన్న అలజడి గావించినారు. యూనివర్శిటీవారు రాయలసీమ ప్రతినిధులను నలుగురిని చేర్చినారు. వారు ఎందుకు నియమితులయినారో ఆ పనికి పూనుకొనక నెగ్గిన తీర్మానమునకు అపార్థము కలిగించుటకు సంకల్పించి నారు. ఆ తీర్మానములో "Classical Telugu forms as well as modern Telugu forms" గ్రాహ్యములే అని ఉంటే, రెండున్ను అయిన forms మాత్రమే అన్న అర్థమారోపించి, పట్టికలు తయారు చేయుటకు పూనుకొన్నారు. సలహా సంఘంలో ఇప్పుడు గ్రాంథిక భాషావాదుల సంఖ్య ఎనిమిదయినది. కనుక వారన్నదే స్థిరపడినది. ఈ యపార్థము కలిగించుట వలన అనుసరించవలసిన భాష సంకుచితమైనదన్న విషయము, తమ వాదము యెడల ఆగ్రహావేశము గల వారగుట చేత ఎవరును ఈ అంశమును గ్రహించలేదు. అనవుడు, నావుడు, అర్థానుసారము, శకట రేఫము మొదలయినవి వ్యావహారిక భాషలో లేవు గనుక వాటిని విడిచి పెట్టవలెను. చేస్తాను, పోతాను, వాడయితే మొదలైనవి గ్రాంథిక భాషలో లేవు గనుక వీటిని విడిచి పెట్టవలెను. అంతకంటె విపరీతమైన ఫలితమేమంటే ''చెట్లు వాని శాఖలు'' అనేవి వాడుకలో లేదు గనుక దానిని విడిచి పెట్టుకోవలెను. ''చెట్లువాటి శాఖలు'' అనేది గ్రాంథిక భాషలో లేదు గనుక దీనిని విడిచి పెట్టుకోవలెను. ''వాని, వాటికి''మారుగా రెంటను గల పదము లేదు గనుక ''చెట్లు చెట్ల

శాఖలు'' అని అనవలసి వస్తుందన్న విషయము ఎవరును గమనించలేదు. ఈ తీర్మానము పైని గురుజాడ అప్పారావుగారు "Minute of dissent" సమర్పించారు. ''ఇక్కడ మన మేమి చెప్పినా ప్రయోజనము లేదు. తెలుగు దేశమందు సంచారము చేసి, సభలు గావించి, జనులకు ప్రబోధము కలిగించవలెను. మన వాదము నెగ్గితే ప్రభుత్వము వారున్ను యూనివర్శిటీవారున్ను మన వాదమును అంగీకరింపక తప్పదు,'' అని మా నాన్నగారు తమవాదమును సభల ద్వారా ప్రసరింప జేయుటకు పూనుకొన్నారు.

మాతండ్రిగారు వ్యావహారిక భాషా రచనావశ్యకతకు సంబంధించినకృషి తీవ్రంగా సాగించారు. ప్రాచీన కావ్యభాషాలక్షణమునకున్ను వ్యావహారిక భాషా లక్షణమునకున్ను గల తార తమ్యము నిరూపిస్తూ, ప్రాచీన శబ్దరూపములు, కారకము, నుడికారము మొదలయినవి ఎట్లు స్వభావ సిద్ధముగా మారుతూ వచ్చినవో తెలియజేస్తూ ''మోడర్న్ తెలుగు మూవ్‌మెంట్'' "Modern Telugu movement" అనే చిన్న గ్రంథమును 1912లో ప్రకటించి ప్రభుత్వ విద్యాశాఖవారికిన్ని, విశ్వవిద్యాలయంవారికిన్ని పంపించారు. కావ్యభాషలో కూడా వ్యావహారిక భాషా ప్రాభావము వలన అంతకంతకు ఎక్కువగా పూర్వవ్యాకరణాలలో చెప్పిన నియమాలకు విరుద్ధములైన ప్రయోగములు ఎట్లు వచ్చినవో చూపిస్తూ, చిన్నయసూరి కాలంలోను, అంతకుపూర్వమున్ను విద్యార్థులు చదువుకొంటూ ఉండిన పుస్తకాలు ఎట్లు వాడుక భాషలో ఉండెనో తెలియజేస్తూ, ''నిజమైన సంప్రదాయము'' అనే గ్రంథము తెలుగు భాషలో రచించారు. దీనిని 1913లో వావిళ్ల వేంకటేశ్వర్లు శాస్త్రిగారు ముద్రించి ప్రకటించారు.

ఈలోగా 1912లో సెట్టి నరసింహంగారి పుస్తకంలోని భాషను విమర్శిస్తూ ప్రెసిడెన్సీ కాలేజి ఆంధ్రపండితులుగా నుండిన శ్రీ వావిలకొలను సుబ్బారావుగారు '' ఆధునిక వచన రచనా సంప్రదాయ విమర్శనము'' అనే పేరను ఒక చిన్న గ్రంథం ప్రకటించారు. దానిని విమర్శించి వారి వాదాన్ని ఖండిస్తూ ''సొడ్డు'' అనే చిన్న గ్రంథం ఒకదాన్ని నేను రచించి ప్రకటించాను. ఈ విధంగా పత్రికావాదాలు తీవ్రంగా సాగుతూ వచ్చినవి. కాకినాడలో గ్రాంథిక భాషాసంరక్షణ సంఘమేర్పడినది. ''గ్రామ్య'' వాదాన్ని ఖండిస్తూ కరపత్రాలు, చిన్న చిన్న గ్రంథాలు వెల్వడినవి. వ్యావహారిక భాష గ్రంథరచనకు పనికి రాదనడానికి గ్రాంథిక వాదులు చెప్పేకారణాలలో ముఖ్యమైనదిగా ఒకటి చెప్తూ ఉండేవారు. మాండలిక భేదాల వల్ల వాడుక భాషదేశమంతటా ఒకే విధంగా ఉండదు. ఒక మండలం వారి మాటలు మరియొక మండలం వారికి బోధపడవు. కోస్తా జిల్లాల వారు (పోక) చెక్కలు; (కంది) పప్పు అంటారు.* రాయలసీమవారు (పోక) వక్కలు, (కంది) బేడలు అంటారు. బేడ అంటే రెండణాలా? అంటారు కోస్తా జిల్లాలవారు చెక్కలు అంటే కర్రపేళ్లా? అంటారు రాయలసీమవారు. ఈవిధంగా మాండలిక భాషా పదములను పేర్కొని వ్యావహారిక భాషావాదాన్నిఖండించడానికి గ్రాంథిక వాదులు చూచేవారు.

ఒకసారి ఆంధ్రసాహిత్యపరిషత్ సభలో ఈ మాటలనే కొందరు పేర్కొని అపహాస్యం చేసినప్పుడు సభ్యులునవ్వుతూ కరతాళధ్వనులు చేశారు. అప్పుడుమాతండ్రిగారు ''సరే, కాని, ఈ

మాటలు తప్పించి వీటికి బదులుగా మరి యే మాటలు వాడవలెనో చెప్పండి'' అనే అడిగేటప్పటి ఒకరి మొగం ఒకరు చూచుకొని మరిమాటాడలేదు. మాండలిక భేదాలు వ్యావహారిక భాషలో కాదు గ్రాంథిక భాషలో వ్రాయదలచినా రాక తప్పదు. తిక్కన సోమయాజి మొదలుకొ నేటివరకున్ను గల ప్రసిద్ధ కవులందరున్ను తమ మండలమందలి మాండలికపదాలు ప్రయోగిస్తూ వచ్చారు.

క. ''కేశవ యాంధ్రులు నానా। దేశంబుల యందు నిలిచి తెలుగులె తత్త। ద్దేశోక్తులంటఁబలికిన। నా శబ్దము లన్యదేశజాంధ్రములయ్యెన్'' అని అప్పకవి మాండలీయక పదాలను నిరూపించి గ్రాహ్యములుగా చేర్చుకొన్నాడు. ఆంధ్రనామసంగ్రహంలోను, ఆంధ్ర భాషార్ణవంలోను మాండలీయక పదాలు పర్యాయపదాలుగా చేరినవి. ఇవి శబ్దరత్నాకరములోనికి ఎక్కినవి. ''పప్పు బేడయన సూపంబుదనరారు'' ''పైకము, డబ్బు, దుడ్డు'' ''చిల్క, గొళ్లెము'' ''బొంగరమనగను, బొమ్మ రమ్మనగను'' ఈ విధంగా ఆంధ్ర భాషార్ణవములో పేర్కొన్నారు. శ్రీనాధుడు హరవిలాసంలో (II.31)'పప్పు' ప్రయోగించాడు. ఆముక్తమాల్యదలో (II.88)బేడలు ప్రయుక్తమయినది. ఆంధ్రప్రభుత్వ-ఆస్థాన కవి సార్వభౌములు తమ మహాభారతం ఆదిపర్వం (X.232)లో ''జివఁగొని'' అని ప్రయోగించి, అది నిఘంటువులలో లేదుగనుక పుటయడుగున ''జివ= దార్ఢ్యము(వానికింకను జివచేరలేదు) ఇట్లుగోదావరి మండలమున వాడుదురు'' అని తెలియజేశారు. మాటల విషయంలోనే కాదు నుడికారంలో కూడా మాండలిక భేదాలుంటవి. వాటినిగూడా కవులు తమ గ్రంథాలలో ప్రయోగించారు. వేదంవేంకటరాయశాస్త్రుల వారు తమ కథా సరిత్సాగరంలో ''చెప్పికాఁగానే'' ''చెప్పుకొనియయిన తర్వాత'' మొదలగు మాండలిక ప్రయోగాలు చేశారు. ఇది సంప్రదాయ సిద్ధమేకాని వ్యావహారిక భాషావాదులు కొత్తగా తెచ్చి పెట్టే వైపరీత్యముకాదు. ఈ విషయాన్ని సరిగా గుర్తించక నేటి పెద్దలలో కొందరు ఇంకా ఈ వాదాన్ని సాగిస్తూనే ఉన్నారు. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభమొదలయిన దినపత్రికలలోను, వార, మాసపత్రికలలోను, కథలలోను, నవలలోను గల భాష కేవలము వ్యావహారిక భాష. దేశమందన్ని జిల్లాలవారూ చదువుతున్నారు అర్థం చేసుకొంటున్నారు. రాజకీయవేత్తలలోను మంత్రులలోను అన్నిజిల్లాలవారున్ను ఉన్నారు. అందరూ అన్ని జిల్లాలకును పోయి ఉపన్యాసాలిస్తున్నారు. వారు కేవలము వ్యావహారిక భాషేమాట్లాడుతున్నారు. అందరికీ అర్థమవుతూనే ఉన్నది. కనుక, వ్యావహారిక భాషలో గ్రంథరచన సాగనిస్తే మాండలిక భేదాల వల్ల కొందరికి అర్థం కాకుండాపోతుందనే ఆక్షేపానికి ఆధారం లేదు. ఎక్కడో ఒక వాక్యంలో ఒకమాట తమకు పరిచయం లేనిది ఉన్నాసందర్భం బట్టి అర్థమవుతూనే ఉన్నది. ఇంతకూ వ్యావహారిక భాషకున్ను గ్రాంథిక భాషకున్ను గల తేడా ఈమాండలిక పదాలలో లేదు; శబ్దరూపాలలో ఉన్నది. వస్తాను. చేస్తాను, ఐతే, అంటే, అదిన్నీ ఇదిన్నీ, వాడూ, వీడూ, చేసింది. మాటా ఇరవైతొమ్మిదిమొదలయిన శబ్దాలను తెలుగువారందరూ వాడుతున్నారు. కోస్తాజిల్లాలవారు చూచాను, చేశారు, వచ్చాము అంటే రాయలసీమవారు చూస్తిని, చేస్తిరి, వస్తిమి అంటున్నారు. ఈ రూపాలలో కొన్నిటిని తాము వాడకపోయినా అందరికీ అర్థమవుతూనే ఉన్నవి.

*(సశేషం)*

# నవ్వు నాలుగు అందాల చేటా?

-మిసిమి రచనల వర్క్ షాప్

''నవ్వు నాలుగందాల చేటు'' అంటారు. అందులో కొంత సత్యం లేక పోలేదు. సమయం సందర్భం లేకుండా నవ్వితే ఎదుటివారికి కోపం వస్తుంది. అలాగే యువతులు కొన్ని సందర్భాలలో నవ్వినప్పుడు వేరే అర్థం స్ఫురిస్తుంది. అందుకని మన సమాజంలో యువతుల మీద ప్రత్యేకంగా ఆంక్షలున్నాయి. ఇలాంటి ప్రత్యేక సందర్భాలను మినహాయిస్తే నవ్వు నాలుగందాల చేటు కాదు గదా, అది మనిషి ఆరోగ్యానికి మంచి మందులాగా పని చేస్తుంది. అందుకనే **Laughter the best medicine** అని **Laughter is no laughing matter** అని అంటారు. కోపం వచ్చినప్పుడు మొత్తం 10 కండరాలు పనిచేసి గుండెకు పని ఒత్తిడి ఎక్కువ అవుతుందట. అదే నవ్వుతున్నప్పుడు 4 కండరాలే పనిచేసి గుండె మీద భారం పడనీయదు. ఆ విధంగా నవ్వు గుండె పోటు నుంచి కాపాడుతుంది.

నవ్వు ఓ విధంగా ఒక అంటుజాడ్యం. ఒకరు నవ్వుతుంటే, కారణం తెలియకుండానే, ప్రక్కనున్న వారు గూడ నవ్వుతారు. అంతటితో ఆగక అది ఇతరులకు కూడా ప్రాకుతుంది. ఇది అంటువ్యాధి అని రుజువు చేసే సంఘటన ఒకటి జరిగింది. అ సంఘటన **African Journal of Medicine**లో ప్రచురితమైంది. టాంగన్యీకా, బకోబా జిల్లాలో ఒక స్కూలు తరగతి గదిలో పంతులుగారు చేసిన చిన్న రిమార్క్‌కి ఇద్దరు పిల్లలు కిచకిచ మన్నారు. కొంచెం సేపట్లోనే తరగతి తరగతి నవ్వడం మొదలు పెట్టింది. ప్రక్క గదుల్లో పిల్లలు ఇది విని వాళ్ళూ నవ్వడం మొదలు పెట్టారు. తరవాత కొంచెం సేపటికే స్కూలు మొత్తం పాకింది. ఆ నవ్వు ఎంతకూ ఆగక పోవడంతో, స్కూలు నాటికి మూసివేయక తప్పలేదు. ఆతరవాత పిల్లలు ఆపుకోలేని, అదుపు చేయలేని నవ్వుతో ఇళ్ళకు చేరారు. ఇది చూసిన తల్లిదండ్రులకు ఈ జాడ్యం ప్రాకింది. ఆ మరు రోజంతా పిల్లలు పెద్దలూ అందరూ నవ్వుతూనే ఉన్నారు. పిల్లలు బడికి, పెద్దవాళ్ళు పనికి వెళ్ళ లేకపోయారు. మొత్తం ఇది ఆగ్రామం అంతా పాకింది. నవ్వి నవ్వీ అలిసి పడిపోతున్న కారణంగా రెడ్‌క్రాస్ వారిని పిలవ వలసి వచ్చింది.

రాబర్ట్ హోల్డెన్ అనే మనో విజ్ఞాన శాస్త్రవేత్త దీనిని కదాకార అంటు జాడ్యంగా వర్ణించాడు. దీనిపై ఆయన ఇంటర్వ్యూ ఇస్తున్న సందర్భంలో ఆయన నవ్వాడు. ఇంటర్వ్యూ చేసే అతడూ నవ్వాడు. కారణం ఏమిటి అని ప్రశ్నవేసుకొన్నారు. ఇద్దరూ సమాధానం చెప్పలేక పోయారు. గమ్మత్తేమిటంటే కారణం లేకుండానే నవ్వుతారు. ఆ సంఘటన నమ్మశక్యం కానిదంటా రాయన. ఒక చిన్న గుళికో, ఇంజెక్షనో తీసుకొంటే అలా నవ్వువస్తే ఎంత బాగుండును. **'Laughter, the Best Medicine'**అనే గొప్ప గ్రంథం రాసిన ఆయన ''అసలు నవ్వే మందు అయితే, మరి దానికి మందేమిటి?'' అంటాడు.

ఈ సంఘటన మూడో ప్రపంచంలో అయితే జరిగింది కాని, పాశ్చాత్య దేశాల్లో అయితే జరగదు. ఎందుకంటే మూడో ప్రపంచంలోని జనాభా పాశ్చాత్య దేశవాసులు లాగ నాడీరుగ్మతలతో, అవసాదంతో, వ్యాకులతతో సతమతం కావడం లేదు. ఈ రోగాల వల్ల వారు దాదాపుగా నవ్వడమే మరిచి పోయారు.

సర్వ జీవరాశుల్లో నవ్వగలిగింది మానవుడు ఒక్కడే. ఇది మానవునికి పరిణామం ఇచ్చిన వరం. అలాంటిది మనం పెద్దవాళ్ళం అయిన కొలది నవ్వడం మరిచి పోతున్నాం. చిన్న పిల్లలు సగటున రోజుకు 400 సార్లు చిరునవ్వు నవ్వుతారు. యువకులు 150 సార్లు నవ్వుతారు. పెద్ద వాళ్ళు అయ్యేకొలది అది 6 సార్లకు దిగుతుంది. అధునాతన నాగరికత తెచ్చి పెట్టే అవసాదాలు, నాడీ రుగ్మతలు, వ్యాకులతలు నవ్వును మనిషికి దూరం చేస్తాయేమో.

ప్రేమ ఇంతవరకూ ఎవరికీ అర్థం కాలేదు. నవ్వూ అంతే. దానిని అర్థం చేసుకోవాలని ప్రయత్నించిన కొలదీ దొరకకుండా చిక్కకుండా పోతూంది. ఏది ఏమైనా నవ్వు కండర తన్యత (Muscle Tension)తగ్గించి నాడీ మండలం మీద ఒత్తిడి (Stress) ని తొలగిస్తుందని వైద్య శాస్త్రం సాక్ష్యం పలుకుతున్నది.

**ERICH FROMM**

A certain change in the emphasis of having and being is apparent in the growing use of nouns and the decreasing use of verbs in western languages in the past few centuries. A noun is the proper denotation for a thing. I can say that I *have* things: for instance that I have a table, a house, a book, a car. The proper denotation for an *activity* is expressed in terms of *having*: that is, a noun is used instead of a verb. But to express an activity by *to have* in connection with a noun is an erroneous use of language, because processes and activities cannot be possessed; they can only be experienced.

**To have Or to Be?**

# హరిత గృహ ప్రభావం

– డా. చాగంటి కృష్ణ కుమారి

అన్నివైపులా గాజు పలకలతో మూసివేసి ఉన్న ఒక పెద్ద గాజు పెట్టెలో మీరంతా ఉన్నట్టుగా ఊహించుకోండి. ఓ పది నుండి పన్నెండు గంటలపాటు అటువంటి ఇంట్లో బంధింప బడ్డారనుకోండి. మీకేమైనా సుఖం ఉంటుందా? గిలగిల్లాడి పోతారు! స్వేచ్ఛగా చల్లని గాలిని పీల్చుకొనేందుకు అవకాశం లేదు కదా! వేడిమిని తట్టుకోలేక అందులోంచి ఎప్పుడు బయటపడాలా? ఎలా బయటపడాలా? అని ఆలోచిస్తారు.

మనమంతా భూగోళవాసులం. మన యిల్లు భూగోళం. మనమూ, మనతోపాటు జీవిస్తున్న ఇతర జీవరాశులూ సరిగ్గా ఇటువంటి ఒక గాజు పెట్టెలాంటి ఇంట్లోనే బంధింపబడిపోతూ సౌఖ్యానికి దూరమవుతున్నాం. అనారోగ్యానికి గురి అవుతున్నాం. ప్రాణాపాయాన్ని కొని తెచ్చుకొంటున్నాం. కొన్ని జీవరాశులు నామ మాత్రం కూడా మిగలకుండా విలుప్తమయిపోయే పరిస్థితికి చేరువవుతున్నాం. రాను రాను ఈ భూగోళం ఆరోగ్య ప్రదమైన చల్లని గాలికి తెఱప లేని ఓ పెద్ద గాజు గృహంలా తయారవుతోంది. ఇలాగే మన జీవనం కొనసాగుతూ ఉంటే భవిష్యత్తులో ఈ ప్రపంచం అంతా ఏమయిపోతుంది? ఎటు వంటి అవాంఛనీయ ప్రభావానికి లోనవుతుంది?

వృక్షశాస్త్రజ్ఞులు వాళ్ల పరిశోధనల నిమిత్తం మొక్కలను 'మంచు' వల్ల అపాయం లేకుండా పెంచు కోవడానికి ఒక గాజు పలకల గృహాన్ని నిర్మించుకొంటారు. వాళ్లు దానిని ఉష్ణగృహం (Hot house) అంటారు. ఈ గృహంలో ఉష్ణోగ్రతనూ, తేమనూ నియంత్రించుకోవటానికి ఏర్పాట్లు ఉంటాయ్. సున్నితమైన మొక్కలనూ, కాలం కాని కాలంలో పెంచుకొనే మొక్కలనూ వీటిలో పెంచుతూ ఉంటారు. వెచ్చని యింట్లో పచ్చని మొక్కలు కాలం కాని కాలంలో కూడా పెరుగుతూ పుష్పించి ఫలిస్తూ ఉంటాయి కనుక, వారా గృహాన్ని ''హరితగృహము'' Green House లేదా ''పచ్చని యిల్లు'' అని కూడా అంటారు.

ప్రకృతి మనందరికోసం ''భూగోళం'' అనే ఓ హరిత గృహాన్ని నిర్మించి యిచ్చింది. భూ ఉపరితల ఉష్ణోగ్రతనూ, వాతావరణంలోని తేమనూ ప్రకృతే నియంత్రిస్తోంది. సహజంగా వాతావరణంలో నీటి ఆవిరి, కార్బన్ డయాక్సైడ్ వాయువులు ఉన్నయ్. సూర్య రశ్మి వల్ల భూమి వేడెక్కుతుంది.

ఆ వేడిమిలో కొంత భాగాన్ని తిరిగి భూమే దిగంతరాలలోకి మళ్లించివేస్తుంది. వెనుకకు మళ్లి పోతున్న ఉష్ణ కిరణాలను వాతావరణంలోని కార్బన్ డయాక్సైడ్, నీటి ఆవిరులు శోషించుకొంటాయ్. ఇలా వేడెక్కిన ఆవాయువులు ఆ వేడిమిని మళ్లీ భూమివైపుకే మళ్లించి

---

★ **డా. చాగంటి కృష్ణకుమారి** కొత్త గూడెం సింగరేణి కాలరీస్ మహిళా కళాశాలలో రసాయనిక శాస్త్రశాఖలో రీడరుగా పనిచేస్తున్నారు.

వేస్తాయ్. కనుక భూ ఉపరితలం వేడెక్కుతుంది. అందుచేత భూ ఉపరితల ఉష్ణోగ్రత వాతావరణంలోని ఈ వాయువుల గాఢతపై ఆధారపడి ఉంటుంది.

వృక్షశాస్త్రజ్ఞుల ''పచ్చని యింట్లో'' గాజు పలకలు ఎలా అవుతే వేడిమిని వెలుపలకు పోకుండా అప్పగిస్తూ, లోపలి ఉష్ణోగ్రతను నియంత్రించటంలో సహాయపడుతున్నాయో, అదే విధంగా వాతావరణంలోని ఈ రెండు వాయువులు సహజ రీతిలో భూ ఉపరితల ఉష్ణోగ్రతను అదుపులో పెడుతున్నాయ్ కనుక ఈ వాయువులను హరితగృహ వాయువులు అన్నారు. ప్రకృతి సిద్ధంగా ఉన్న ఈ ప్రభావాన్ని ''హరిత గృహ ప్రభావం'' అన్నారు.

కార్బన్‌డయాక్సైడ్‌వాతావరణంలో ఉండే ప్రధానమైనహరితగృహవాయువు వాతావరణంలో దీని గాఢత మితిమీరిన స్థాయి చేరుకుంటే ఉష్ణోగ్రత బాగా పెరిగి పోయి జీవులకు భూగోళం నివాసయోగ్యం కాకుండా పోతుంది. శుక్రగ్రహంపై వాతావరణంలో ఈ వాయు గాఢత భూ వాతావరణంలోని దాని గాఢత కన్నా 60 వేలరెట్లు ఉంది. శుక్రగ్రహ ఉష్ణోగ్రత 425 సెంటి. గ్రేడ్ డిగ్రీలుగా నిర్ణయమైంది. అక్కడ ప్రాణుల ఉనికికి ఆస్కారమే లేదు.

వాతావరణంలో కార్బన్‌డయాక్సైడ్ అసలేలేకుండా పోయినా జీవులు ఉండవు. భూగోళంపై అప్పుడు మంచు తప్ప మరేమీ మిగలదు. అంగారకునిలో కార్బన్ డయాక్సైడ్ అసలు లేనేలేదు. అందుకే అది కరడు గట్టిన మంచుగడ్డ అయింది.

ఆకు పచ్చని చెట్లు కిరణ జన్య సంయోగ క్రియలో వాతావరణంలోని కార్బన్ డయాక్సైడ్ వాయువును తీసుకొంటాయ్. అడవులు ఈ వాయువుకు ప్రధానమైన శోషక నెలవులుగా వ్యవహరిస్తున్నాయ్. వాతావరణంలో దాని గాఢతను అదుపులో ఉంచటంలో ప్రధాన పాత్రను పోషిస్తున్నాయ్.

సముద్ర ఉపరితల జలాలుకూడా ఈ వాయువుకి శోషకనెలువులుగా వ్యవహరిస్తున్నాయ్.

జీవరాశుల శ్వాసప్రక్రియలోనూ, మానవుడు తన శక్తి అవసరాలకు బొగ్గు, కలప, సహజవాయువు, చమురులను మండించినపుడూ, మోటారు వాహనాల వాడుకలోనూ కార్బన్ డయాక్సైడ్ విడుదలఅయి వాతావరణంలో చేరుతూ ఉంటుంది. అయినప్పటికీ శోషకనెలవులు వాటి వంతు వాయువును అవి శోషించుకొని, వాతావరణంలో దాని గాఢతా సమతూకాన్ని కాపాడుతాయి. ఈ విధంగా వాతావరణంలో ఈ వాయు గాఢతను 0.03 శాతము ఉండేటట్టు అదుపు చేస్తూ భూ ఉపరితల ఉష్ణోగ్రతను 15 సెంటిగ్రేడ్ డిగ్రీల వద్ద ఉండేలా పకృతి నియంత్రణ చేస్తోంది. అందువల్లే మనమంతా చెట్లతోనూ, అడవులలోనూ, జంతువులలోనూ, సహజీవనం చేస్తూ ఈ భూగోళంపై మనగలుగుతున్నాము. దీనినే ''హరిత గృహ ప్రభావము'' అంటారు.

20వ శతాబ్దం ప్రారంభం నుండే వాతావరణంలో కార్బన్ డయాక్సైడ్ గాఢత నానాటికీ

పెరిగి పోతోంది. శిలాజ ఇంధనాల వాహనమూ, మోటారు వాహనాల వాడుకా మితిమీరి పోవటమే కాకుండా అడవుల నరికి వేత కూడా ఎక్కువ అయింది. అడవులను నరికి వాటి గుండా రహదారులను నిర్మిస్తున్నారు. గృహ నిర్మాణాలు అధికం అయ్యాయి. అంతస్తులపై అంతస్తులు లేస్తున్నాయ్. అడవులుస్థానే నగరాలు నెలకొంటున్నాయ్. జనాభా పెరుగుదల సరేసరి!

పారిశ్రామీకరణంలో విద్యుత్ ఉత్పాదక కేంద్రాలు ఎక్కువ అయ్యాయ్. వీటిలో ఎక్కువ కేంద్రాలు బొగ్గునే ఇంధనంగా వాడుతున్నాయ్. ఇతర పరిశ్రమల నుండి కూడా కార్బన్‌డయాక్సైడ్ విడుదల నానాటికీ పెరిగిపోతోంది. దీనివల్ల ప్రకృతి సిద్ధమైన హరిత గృహ ప్రభావము అతిశయిస్తోంది. మానవకార్యకలాపాల వల్ల అతిశయిస్తున్న హరిత గృహ ప్రభావాన్ని ''భూమి వేడెక్కడం''(Global warning) అంటారు.

పారిశ్రామిక విప్లవానికి ముంధు వాతావరణంలో 290 నుండి 300 పి.పి. ఎం (ppm) మేరకు కార్బన్ డయాక్సైడ్ ఉండేది. 1880 నాటికి దాని గాఢత 283 పి.పి.యం (ppm) కాగా, పారిశ్రామికరణ తరవాత పరిశీలించి చూస్తే 1987 నాటికి 348 పి.పి. ఎం. అయింది. 1994, 1995 సంవత్సరాలనాటికి 356 పి.పి.ఎం చేరుకొంది!

ప్రస్తుత మానవ కార్యకలాపాలు ఇలాగే కొనసాగితే రానున్న 50 సంవత్సరాల కాలంలో ఈ గాఢత రెండింతలు కావచ్చునని వాతావరణ శాస్త్రజ్ఞుల అంచనా. వీరి అభిప్రాయం ప్రకారం కార్బన్ డయాక్సైడ్ గాఢత రెండింతలు అయినప్పుడు భూమి సగటు ఉష్ణోగ్రత 2 సెంటిగ్రేడ్ డిగ్రీల మేరకు పెరుగుతుంది. 2050 సంవత్సరం నాటికి 1.5 నుంచి 4.5 సెంటి గ్రేడ్ డిగ్రీల మేరకు ఉష్ణోగ్రత పెరుగుదల ఉండవచ్చునని వీరు అభిప్రాయ పడుతున్నారు.

కార్బన్ డయాక్సైడ్ నీటి ఆవిరులేకాక, ఓజోన్, మీథేన్, నైట్రస్ ఆక్సైడ్, క్లోరోఫ్లోరో కార్బన్‌లు కూడా హరిత గృహ వాయువులుగా గుర్తించబడ్డాయి. ఆధునికంగా మానవ జీవన విధానాల వల్ల ఇవి అసహజరీతులలో వాతావరణంలో చేరుతూ భూమి వేడెక్కి పోవడానికి కారణమవుతున్నాయ్

1989 జూన్ 5వ తేదీన ప్రపంచ పరిసరాల దినోత్సవాన్ని జరుపుకొంటూ యునైటెడ్ నేషన్స్ ఎన్విరాన్‌మెంట్ ప్రోగ్రాం వారు ప్రపంచం మొత్తంమీద అందరినీ అప్రమత్తులను చేశారు. ఆరోజున ''గ్లోబల్ వార్మింగ్ - గ్లోబల్ వార్నింగ్'' అంటూ నినాదాలు చేశారు. ఇది నిజంగా పెద్ద హెచ్చరిక. ''భూమి వేడెక్కడం'' అనే అంశంపై దృష్టిని కేంద్రీకరించి, దీనివల్ల వచ్చే అనర్థాలను తెలుసుకొని, హరిత గృహ ప్రభావ అతిశయాన్ని అరికట్టే ప్రయత్నాలను వెనువెంటనే ప్రారంభించాలి. ఆధునిక జీవితం కొనసాగిస్తున్న ప్రతీ ప్రపంచ పౌరునికీ ఈ విషయంలో బాధ్యత ఉంది.

ఉష్ణోగ్రతా పెరుగుదల వల్ల సముద్ర ఉపరితల జలాలు వ్యాకోచంచెంది సముద్ర మట్టం

పెరుగుతుంది. తత్ఫలితంగా లోతట్టు ప్రాంతాలలో ఉన్న నగరాలన్నీ మునిగిపోయే ప్రమాదం ఉంది.

ఉష్ణోగ్రతా పెరుగుదల వల్ల ప్రకృతి వైపరీత్యాలు ఎక్కువ అవుతాయి. చరదలూ, వెల్లువలూ, ఉగ్రమైన గాలి వానలూ, తుఫానులూ ఉప్పెనలూ తరచుగా వస్తూ ఉంటాయ్. వాటి వల్ల కలిగే నష్టాలు పూడ్చలేనివి అవుతాయ్.

శీతోష్ణస్థితిలోని మార్పులు నేరుగానూ, గణనీయమైనవిగానూ పంటలపై ప్రభావాన్ని చూపుతాయి.

తీవ్రమైన శీతోష్ణస్థితి మార్పులకు అలవాటు పడటానికై జీవరాశులకు సరికొత్త లక్షణాలను సంతరించుకోవాల్సి వస్తుంది లేదా శీఘ్రగతిని కొత్త ప్రదేశాలకు బదలీ కావలసి వస్తుంది. ఈ మార్పులకు తట్టుకోలేనివి విలుప్తమయి పోతాయ్. అనేక వన్యప్రాణులు నశిస్తాయ్.

శాస్త్రజ్ఞులంతా ''హరిత గృహ ప్రభావాతిశయంచేత భూమి వేడెక్కుతున్నది'' అనే అంశంపై అంగీకారానికి వస్తున్నప్పటికీ, ఈ ప్రభావం ఏ మేరకు ఉంటుందో ఖచ్చితమైన విలువలలో చెప్పడం ప్రస్తుతానికి సాధ్యం కావడం లేదు.

ప్రకృతిలో జరిగే అనేక ప్రక్రియలలో చోటుచేసుకొనే ''సంక్లిష్టత'' దీనికి కారణము. భవిష్యత్తులో సూపర్ కంప్యూటర్ నమూనాలు శీతోష్ణస్థితి మార్పులను మరింత ఖచ్చితంగా లెక్కకట్టగలవని శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నారు.

ఉష్ణోగ్రత పెరుగుదలను అరికట్టి సహజ పరిస్థితులు నెలకొని ఉండేలా చేయడానికి ఏమైనా మార్గాలు ఉన్నయా? ఎందుకు లేవు; ఉన్నాయి.

శిలాజ ఇంధనాల వాడకాన్ని తగ్గించి వాటి స్థానే ప్రత్యామ్నాయ శక్తి వనరులను వాడుకోవాలి. సౌరశక్తి, వాయుశక్తి, భూతాపశక్తి, సముద్రతరంగాల శక్తి, బయోశక్తి వంటి శక్తి ఉత్పత్తులను పెంచుకోవాలి. వాటినే వాడుకోవాలి. అడవుల నరికి వేతను ఆపి వేయాలి. పెద్ద పెట్టున అడవుల పెంపకాన్ని చేపట్టాలి. సామూహిక అడవుల పెంపకాన్ని ప్రోత్సహించాలి. వన్యప్రాణులను సంరక్షించాలి. మోటారు వాహనాల వాడుకను తగ్గించాలి. కాలుష్యాన్ని కలిగించని ఆటో మొబైల్ ఇంజన్ల తయారీకై పరిశోధనలను నిర్వహించాలి. క్లోరోఫ్లోలో కార్బన్‌ల వాడకాన్ని నిషేధించాలి. వాటి స్థానే ప్రత్యామ్నాయ రసాయనాలను కనుగొనాలి. కుటుంబనియంత్రణను ప్రోత్సహించాలి. వాయుకాలుష్య నివారణా పద్ధతులను కఠినంగా అమలుపరచాలి. పరిసర విజ్ఞానాన్ని అందరికీ నియంత్రిత, అనియంత్రిత విద్యా విధానం ద్వారా అందించాలి.

వాతావరణంలో హరిత గృహవాయువులు చేరుతున్నాయ్! ఉష్ణోగ్రత పెరిగి పోతోంది. ఓ తల్లులారా, తండ్రులారా, సోదర సోదరీమణులారా బహుపరాక్, బహుపరాక్, బహుపరాక్.

# చాసో భాష

- డా॥ యు॥ ఎ॥ నరసింహమూర్తి

భాషకు వ్యక్తిముద్ర ఉంటుంది. నిపుణుడైన కథకుడు స్థల-కాల-వస్తు-పాత్ర-సంఘటనాది కథానిర్మాణ సంబంధమైన అవధులను అతిక్రమించకుండా తన భాషమీద తన ముద్రవేస్తాడు. ఈముద్ర స్థూలదృష్టికి అందేలా రూపొందితే దానిని శైలి అంటారు. కొందరు కథకులు తమ భాషమీద వేసే వ్యక్తి ముద్ర సూక్ష్మదృష్టికి గాని అందదు. అటువంటివారు శైలీ నిర్మాతలుగా బహిర్గతం కాలేరు. అటువంటి రచయితల్లో చాసో ఒకరు. భాషకు సంబంధించిన గుప్తచరత్వమే చాసోను భాషను గురించి సుశర్మగారి చేత '' ఒక్కొక్క కథ ఒక్కొక్క భాషలో ఉంటుంది'' అని వ్రాయించింది.

కథకుడికి భాష ఉంటుంది. కథకొక భాష ఉండదు. అల్పసారులు వస్తు వైవిధ్యాన్ని బట్టి పరకాయప్రవేశం చేసి భాషా భేదాన్ని ప్రదర్శిస్తారు. పరకాయప్రవేశం క్షుద్రవిద్య. ప్రతిభావంతుడు ఆపనిచేయడు. వస్తువు-పాత్ర-సంఘటన-వాతావరణం తన దృక్కోణంలోంచి, తన వాగ్విన్యాసంలోంచి పునరుద్గమించేలా చేస్తాడు. అంతుచిక్కని ఆ పనితనంలో కథ స్వయం వికసితం అవుతుంది. అక్షరం మీద తళుకు బెళుకుల తహల్లుక్ వెయ్యడం కాకుండా అంతర్గతమైన ముద్రవేయడం ఒక విలక్షణత. ఆ వైలక్షిణ్యం చాసో భాషలో కనిపిస్తుంది. కథకుడికి శైలీప్రలోభం ఉండకూడదనే మార్గానికి చెందిన రచయిత చాసో. అందుకే అతని భాష పాఠకుడి మనసును కాక మెదడును తాకుతుంది.

భాష వజ్రం లాంటిది. పుష్పంలాంటిది అనేది ఒక పార్శ్వమైతే, "I am below ten" "I am under ten' అనే రెండింటిలో ఏది తప్పు, ఏది ఒప్పు అనేది ఇంకొక పార్శ్వం. ఇందులో ఒకటి శక్తివంతమైన భాషను గురించి చెప్తే, ఇంకొకటి పరిశుద్ధమైన భాషను గురించి చెప్తుంది. రచయిత ఈరెండు పార్శ్వాలను పదునెక్కించాలి. ''భాషలో పదజాలానికి అతీతమైన ప్రతిభతో అనేక భావాలను సూక్ష్మంగా ఆ నవ్వు వ్యక్తపరచింది'' అంటాడు చాసో తన నవ్వు గురించి 'బూర్జువాకుక్క' అనే కథలో. ఆయన దృష్టి భాషలో పదజాలానికి అతీతమైన ప్రతిభ మీద నిలిచి ఉన్నదని మనం అర్థం చేసుకోవడానికి ఈ సన్నివేశం ఉపకరిస్తుంది.

'అదియా సంగతి' ' ఓర్నంజకొడుకో! నాను కాను' 'సర్‌బిరుదమే!నైట్‌హుడ్డే!' 'నేను పండితుడను కాను' 'వొణుకు సంకటం' ' ఇది నా ప్రారబ్ధకర్మమా!' 'వకార్తీకి రూపాయి ముదుర వొట్టుకు రమ్మన్నారు' ' ఆరునెల్లాయి ఒక్కలాగ చూస్తున్నాను మీవాళకం' 'మాగేంగు రెండు పార్టీలైపోయింది' 'వెన్నెల కర్పూరంలా వెలుగుతున్నది' ఇలా ఏన్నో చాసో వాక్యాలను పరిశీలిస్తే పాత్రముఖంగా ఒక్కొక్కటి ఒక్కొక్కతీరుగా వెల్లడైనట్లు కనిపిస్తుంది. ఇది గురజాడ వారసత్వం. కన్యాశుల్కంలో గురజాడ ఎన్నోవర్గాల మాండలికాన్ని సమర్థంగా ప్రయోగించేడు.

---

★ యు.ఎ.నరసింహమూర్తి విజయనగరం మహారాజా స్వయం ప్రతిపత్తి కళాశాల తెలుగు శాఖలో రీడరు. సాహితీ విమర్శకులు.

మచ్చుకి బైరాగి మతంసీను చూడండి. అయితే గురజాడరచనలో భాషదిపైచేయి అవుతుంది. చాసోలో అలాకాదు. అతని భాషకథ రక్తమాంసాలలో, ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో కలసి ఉంటుంది. అతని కథలోని రక్తమాంసాలు కథవైనా, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చాసోవే. గురజాడను వ్యతిరేకించేవారు అతనిలోని గొప్పతనమంతా ఆ భాషదే అంటారు. చాసోను మెచ్చుకొనే వాళ్లైనా అతని భాషకు మాత్రమే పెద్దపీట వెయ్యరు. గుప్తచరత్వమంటే అదే! ఆ మార్మిక నిర్మాణం వల్లనే చాసోని ఏకథకుడూ అనుకరించలేకపోయాడు.

భాష కథకు బతుకునిస్తుందన్న విశ్వాసం చాసో కుంది. అక్కరమాలిన మనిషిని మనం ఇంట్లోకి ఎలారానియ్యమో అలా అసంగతమైన పదాన్ని చాసో తన కథలో కాలుపెట్టనియ్యడు. ఆయన ఎంచుకున్న పదం పర్యాయపదాల పనికిమాలిన తనాన్ని తెలియజేస్తుంది. రచయిత ఒకానొక సందర్భంలో ఒక్కొక్క పదం కోసం ఎంత పరితపిస్తాడో తెలియజేస్తుంది. పదం ఎంతపదునైనదో తెలియజేస్తుంది. పదం చావుపుట్టుక లెలాంటివో జ్ఞాపకం చేస్తుంది. అతని పదాలెప్పుడూ పరకాయప్రవేశం చెయ్యవు. అవసరంలేని పదం కథాశరీరంలో anti-body కింద చేరి రుగ్మత కలగజేస్తుందన్నది చాసో చూపు. 'కంగోరా' 'మునేళం చేప' 'కుక్క జాలి' 'కుచ్చిటప్పాలు' లాంటి మాటలెన్నో మాటకొక చరిత్ర ఉంటుందని, మలుపు ఉంటుందని, సంస్కారముంటుందని, వయసు వంగడం ఉంటాయని, సంగతి, సందర్భం ఉంటాయని చెప్తాయి.

భాష దేవుడిచ్చిన వరం అని కొందరంటారు. భాషను సాహిత్యం ఇస్తుందని కొందరంటారు. భాషను నిఘంటువు ఇస్తుందని అనే వాళ్లున్నారు. పాఠశాలల్లో భాషను నేర్పుతా రంటారు. చాలామంది రచయితలు ఇలాంటి భావాలతోనే భాషను నేర్చుకుని గ్రంథాలు రచిస్తారు. చాసోలాంటి రచయితలు భాషని మనిషి ఇస్తాడని అంటారు. లోకమే నిఘంటువుగా భావిస్తారు. భాషకో చట్టం ఉంటుందని అంగీకరించరు. శిశువుకో భాష- పశువుకోభాష ఉంటుందన్న ఉద్దేశంతో అవసరమైతే శిశువూ అవుతారు, పశువూ అవుతారు. ధనికుడు దరిద్రుడు అవుతారు, పండితుడు - పాషండుడు అవుతారు. వాళ్లు ధరించని వేషాలుండవు. పలకని మాట ఉండదు. 'రథయాత్ర' 'మాతృధర్మం' 'మొక్కుబడి' 'వెలం వెంకడు' 'వాపు' లాంటి కథలు చూడండి. భాషకు ఆకారాలు కనిపిస్తాయి.

'పదాలు గతిభేదపు గర్భగుళ్లు' అన్నాడు నారాయణబాబు. అది కవిత్వం సంగతి. చాసోలా కథలు రాసేవాళ్లకు ఒక పదాని కొకటే గతి, సంగతి అనిపిస్తుంది. బహుళార్థస్ఫూర్తి కోసంగాని, ఒక అందీఅందని రహస్యాన్ని తనలో దాచుకుని అందుకునే తహతహపుట్టించడానికి గాని చాసో పదం ఎప్పుడూ ప్రయత్నించదు. ఉపరితలంలో అది చాలా సాదాసీదాగా కనిపిస్తుంది. కాని నిర్దిష్టంగా, సూటిగా, వాడిగా అర్థాన్ని అందించే పదం కోసం చాసో అన్వేషిస్తాడు. ఆ అర్థం అందిన తర్వాతే దాని అనుభవ వైశాల్యం విస్తరించవచ్చును. కాని అంత వరకు దాని పరిధి పరిమితమైనదే. పదాలకి అతీతమైన అందాన్ని పదాల ఉచ్చులోకి లాగడమే అతని పని.

చాసోకి పండితుల భాషంటే పడదు. 'పడదు' అంటే చెల్లుబాటు కాదు అనే అర్థంలో వాడడం ఆయనకి సరదా. ఏ బరువునైనా ఆయన మోస్తాడు గాని మాట బరువును మాత్రం మొయ్యలేడు. అందుకే గురుజాడ గిరీశం లేఖలో హాస్యంకోసం గ్రాంథిక భాషను వాడినట్లు, 'పరబ్రహ్మం' కథలో గ్రాంథికాన్ని ఉన్మాది భాషగా ఉపయోగించేడు. అతని మిత్రులు నిరసించిన 'చాకలి సరస్వతి'ని ఆయనా అలాగే చూసేడు. అయితే సిద్ధాంతం ఎలాంటిదైనా చాసోకూడా ఒకరకంగా పండితుడే. అతని మిత్రులూ పండితులే! అతని పరిసరాలన్నీ పాండిత్యంతో నిండినవే. అందుకే 'మధురసన్నివేశం' ' ఆశ్చర్యచకితులు' 'దేదీప్యమానం' 'విహాయసవీధులు' 'తనులతాసౌష్ఠవం' 'ప్రప్రథమస్వార్జితం' 'ఘర్మసలిలం' 'లజ్జావనతవదనం' 'పరిష్వంగసుఖం' 'దౌంష్ట్ర' - వంటి పదాలు, పదబంధాలు, వాక్యాలు అతని కథల్లో చొరబడ్డాయి. అందులో కొన్ని ఏదో ప్రయోజనాన్ని ఆశించివాడినవి ఉన్నా కొన్ని మాత్రం అతని స్పృహకు అందకుండా చొరబడ్డవే. అయితే శ్రీ శ్రీ, నారాయణ బాబుల్తో పోలిస్తే చాసోకి భాషావ్యామోహం తక్కువ, అనికాక- లేనేలేదని చెప్పాలి. పై పదాల్లో కనిపించేది అతని ప్రాత్సంస్కారం కాని కథాసంస్కారం కాదు. కౌముదికి పాఠం చెప్పే పెంకితనంతో ''మేష్టరాణీ'' లాంటి పదాలను సృష్టించినా, అందులో అరుదుగా ఒక ''అసూయత'' కూడా కనిపిస్తుంది, ఒక '' ఉన్మాదుడు'' కూడా కనిపిస్తాడు. ''కులాయం కెగిరింది ఆడకత్తెర'' ''పక్షుల కూజితాలు లేవు'' ''కేక.బాకులా దూసుకు పోయింది'' వంటి సందర్భాలలో మాత్రం శ్రీ శ్రీ - నారాయణబాబు అతన్ని ఆవహించినట్లు కనిపిస్తారు.

ఎంత చెడ్డా చాసోకి ఒకమాటతీరు ఉంది. భాషలో అతని ముద్రను పట్టిచ్చే సాధనం అదే. తింటున్నాది. కాల్తున్నాది-నడిచీదాం-నడిచీసేను. గొంతుకిల్లాకూచోడం-చతికిల్లాపడ్డం కనుక్కున్నాది-కనబడ్డాది-విప్పుతున్నాది వంటి క్రియాపదాలు చాసో భాషను పట్టిచ్చే ప్రథమలక్షణాలు. 'కథల్లో నాకు నచ్చింది నువ్వు 'సృష్టించే వాతావరణం' 'కనబడ్డా డా ఇంజనీరు నాలుగురోడ్ల మధ్యలో' 'నాకందింది వాడి నుదుటి మీది జుత్తు' 'చెడ్డతొందరగా పడ్డాయి అడుగులు' 'చూడ్డానికొచ్చిన చుట్టం చేతిలో పెట్టాడు అర్ధణా' 'వెళ్లాడు రామయ్య్య రామునాయుడింటికి' 'పరిగెత్తాడు మాడావారింటికి' వంటి క్రియతో, క్రియాజన్య విశేషణాలతో ప్రారంభమయ్యే వాక్యాలు చాసోభాషను పట్టిచ్చే రెండో లక్షణాలు. ఆయన వాక్యంలో తెలుగుతనం ఉంటుంది కాని ఒక పెడసరితనం ఉంటుంది. 'తెలుసుకొనే వేసుకోబడ్డారు' 'సన్నగా, చిన్నగా, ధవళంగా నేయబడ్డాది' లాంటి 'బడు' ధాతు ప్రయోగం కూడా చాసోమాట తీరును పట్టి ఇస్తుంది.

అనుకరణపదాలు, జాతీయాలు, సామెతలు, ప్రాంతీయపదాలు ప్రయోగించేతీరు రచయిత ప్రత్యేకతను, విలక్షణతను పట్టి ఇస్తాయి. ప్రాచీనసాహిత్యంలోను, ఆధునిక రచనల్లోను వీటన్నింటిని ఇటూ అటూ ప్రయోగించడం ద్వారా లబ్ధి పొందాలని చూసిన రచయిత లెందరో కనిపిస్తారు. ఈ సామగ్రి అంతా సంపాదించదగినది కాదు. ఇది గ్రామీణ సంపద. మధ్యతరగతి స్త్రీల ఆస్తి. ఆ ప్రాంగణాలలో అడుగు మోపని వారికి అవి అందవు. చాసో నిమ్నవర్గాల భాషను మధించాడు.

ఆడవాళ్ల భాషను అందుకున్నాడు. అందుకే అతని భాషకు అన్ని సొగసులు-సొమ్ములు దిబ్బాదిరుగూడం, మన్నూ మశానం, రాళ్లూ రాపాషాణాలు, లొడ్డూలొస్కూ, సొలగకి సొలగ పెద్దంతరం చిన్నంతరం, అర్బుదాలు. నిర్బుదాలు లాంటి జంటపదాలు, 'కుడీ ఎడమాలేద' 'అద్దమాలినపాటగోడు' 'డబ్బుసెడ్డపాపిస్టి' 'వానాలేదు వొంగుడూలేదు' లాంటి లఘువాక్యాలు 'నా నే సెర్లోపడ్డం దేవుడో' 'మాదినం తీరడం ఎలాగ' ''ఎంగిల్లై ఏమాలై'' ''నడ్డివాల్చటం' లాంటి జాతీయాలు, 'తెడ్డెక్కడికెళ్లినా ఏగాణీయే' 'అప్పుచేసికొప్పుసవరం' లాంటి సామెతల చాసోకి భాషాపరమైన నిబద్ధత ఎంతటిది? అనే సత్యాన్ని నిరూపిస్తాయి. తన వ్య సంస్కారాన్నుసరించి ''సర్వమంగళం'' 'మిన్నులుపడ్డ చోటు' వంటి ప్రయోగాలు చేసిన ఆనూపానూ చూసి చేయటం చాసో నేర్పు.

కథకున్న వాతావరణాన్ని బట్టి '' ఎప్పుడు మీరు నన్ను తీసుకెళ్ల గలరు?'' ''బూర్జువ కుక్కకూడా మాతోబాటు ఊటీని ఆనందిస్తున్నది'' అన్నమాదిరి ఇంగ్లీషు వాక్యాలను ''కనకాభిషేకం చేస్తూ, ఆమె తనులతాసౌష్ఠవాన్ని సహస్రనామార్చన చేస్తూ విటకోటి పెంపుడ కుక్కల్లాగ చేరవచ్చారు'' అన్న మాదిరి పాతబడ్డ వాక్యాలను సృష్టిస్తాడు. ఒక్కొక్క చోట ''సహేతుకమైన ఆలోచనతో వీథిని పర్యవేక్షణ చేస్తున్నాడు'' అంటాడు. ఒక్కొక్క చోట భాషలో ''మనోరథసామ్రాజ్యాన్ని'' సృష్టిస్తాడు. ఒక్కొక్క చోట ' ఎండే మా ఎన్నెల' వంట గ్రామీణ సారళ్యాన్ని ప్రదర్శిస్తాడు. చాసో దృష్టిలో అన్నిటికన్నా కథకు వాతావరణం గొప్పది.

శక్తిమంతుడైన రచయిత కొత్తభాషను సృష్టిస్తాడు. అది ఇతరుల చేతివాటానికి లొంగదు ''కుక్కుటేశ్వరుని ఆజ్ఞలేనిదే కుక్కయినా మొరగదు'' ''మీదివోడి దయ ఉంటే మిద్దె యిల్లు మేడౌతుంది'' '' ఆడవాళ్ల శ్రమలేందే ఆకళ్లు తీరవు'' వంటిసామెతలను పదబంధాలను కొత్తగ సృష్టించడం చాసోకు తెలుసు. అంతమాత్రమే అయితే అది ప్రతిభకాదు. ఉత్తరాంధ్ర అంచుల విజయనగరం పరిసరాల్లోని గ్రామీణ భాషను చాసో ఒక జీవితకాలం అన్వేషించాడు ఆయావర్గాలవారు ఏ పదాన్ని ఏసందర్భాలలో ఏ అర్థంలో వాడుక చేస్తారు తెలుసుకోవడం ఆ అన్వేషణ సారం. చాసో సామాజికంగా ఉన్నత వర్గానికి చెందిన వ్యక్తి. అతనికి నిమ్నవర్గాలతో సహజసంబంధమేమీ లేదు. ఉన్నదంతా సాహితీ బంధమే. ఆబంధాన్ని చిక్కులేకుండా నిర్వహించడం కత్తిమీదసాము. తనవర్గానికిచెందిన వాడుకభాషను ప్రౌఢ సాహిత్యభాష నీడలోంచి బయటకు తీసి వెలుగులో నిలపడం ఒక సాహిత్య సౌమనస్యం. ఈ రెండింటినీ నిర్వహిస్తూ అటూ ఇటూ వ్యామోహపడకుండా కథలు రాసిన శిల్పి చాసో.

చాసో భాషలో ఒక్క పదం కూడా ఒళ్లు విరుచుకోదు. కొమ్ము విసరదు. తలతిప్పదు. తన్మయత్వం పొందదు. చాసో తన భాష నలాశాసిస్తాడు. భాషను లాలించడం, బుజ్జగించడం, ప్రేమించడం లాంటివి ఆయనకు చేతకావు. అందుకే ఆయన శైలీ నిర్మాత కాడు. కాని అతని భాషకు సృజనశీలం ఉంది. అందుకే అతని కథలు ఎప్పటికీ కొత్తగా కనిపిస్తూనే ఉంటాయి.

కొత్తవెలుతురు

# ''పిచ్చి'' అంటే

–డా. ఎన్. ఇన్నయ్య.

నీవు దేవుడితో మాట్లాడితే ప్రార్థన అంటారు. దేవుడు నీతో మాట్లాడాడంటే పిచ్చి అంటారు. సుప్రసిద్ధ సైకియాట్రిస్టు థామస్ సాజ్ సూక్ష్మంగా చెప్పిన సత్యమిది.

ఇటీవల ఆయన గ్రంథం Insanity వెలువడింది. అందులో ఆయన కొన్ని మౌళికాంశాలు లేవనెత్తి, ప్రశ్నించి, వివరించారు. మనం అలవాటుగా మాట్లాడే అనేక సందర్భాలు ఎంత అసమంజసమో, అశాస్త్రీయమో చెప్పారు.

మానసిక రోగం అనేది ఉపమాలంకారం అని, పిచ్చి అనేది మిధ్య అని సాజ్ అంటుంటే మనకు ఆశ్చర్యం వేస్తుంది. ఏది పిచ్చో చెప్పమని ఆయన అడిగితే నోరు నొక్కుకోవాల్సివస్తుంది. అలాగే మానసిక రోగం అని అతిసులభంగా వాడేస్తుంటాం. మానసికం అంటే ఏమిటి అని సాజ్ ప్రశ్నిస్తే సమాధానానికి తన్నుకోవాల్సిందే. వీటన్నింటినీ ఆయన చాలా లోతుగా పరిశీలించాడు.

రోగాలు శరీరానికి వస్తాయి. వాటి లక్షణాలు పరిశీలించి, చికిత్సచేస్తారు.

ప్రవర్తన మనిషికి సంబంధించినది. ఇందులో నవ్వడం, ఏడ్వడం, కోపగించడం, అనురాగం, మొదలైనవి వుంటాయి.

అంతవరకూ అర్థమైంది. మూడోది: మానసికం. అక్కడే వచ్చింది చిక్కు. తత్వవేత్తలు మనస్సు గురించి చాలా రాశారు. కాని మానసిక రోగాల జోలికి పోలేదంటారు సాజ్. సైకియాట్రిస్టులు మనస్సు అంటే ఏమిటో చెప్పకుండానే మానసిక రోగాలకు చికిత్స చేస్తున్నారని సాజ్ అభ్యంతరపెట్టారు. మానసిక చికిత్స అనేది దేవతా వస్త్రాలతో పోల్చి, దేవతలూ లేరు, వస్త్రాలూ లేవని సాజ్ చెప్పాడు.

కొందరు యిటీవల పిచ్చి అంటే, మెదడుకు వచ్చే రోగం అంటున్నారని, అలాగయితే మెదడు స్పష్టంగా శరీరంలో ఒక భాగం అనీ, దానికి నిర్దుష్టమైన శాస్త్రం, లక్షణాలు వున్నాయని అన్నాడు. మెదడులో ఏభాగం ఎలా పనిచేస్తున్నదో, దానికి చికిత్స ఏమిటో మెదడు శాస్త్రం అధ్యయనం చేస్తున్నదని సాజ్ స్పష్టం చేశారు. కనుక ''పిచ్చి'' అనేది ఒక అంగానికి వచ్చే రోగంగా నిర్ధారించలేక పోయారని ఆయన అన్నారు.

ఆత్మ అనేది వున్నదనే భ్రమ కల్పించి దానికి చికిత్స నిమిత్తం వివిధ శిక్షలు సైతం విధించిన పురోహిత వర్గం ఎలా ప్రవర్తిస్తున్నదో, సైకియాట్రిస్టులు కూడా మానసికం పేరిట అలానే చేస్తున్నారన్నారు.

ఫ్రాయిడ్ మానసిక రోగాలకు మూలంగా స్వప్నాలను స్వీకరించాడు. అదొక శాస్త్రంగా పెంపొందించే ప్రయత్నంచేశాడు. ఆ భ్రమలో సైకో ఎనాలసిస్ రూపొందింది. నేడు అదంతా శాస్త్రీయం కాదని, రుజువుకు నిలవడం లేదని తెలిసేసరికి, అనేక చిలవలు పలవలుగా మార్పులు చేశారు. కాని సైకియాట్రిని మాత్రం వదలకుండా, 'మానసిక చికిత్స' అంటూ కొనసాగిస్తున్నారు.

---

★ డా. యన్. ఇన్నయ్య ప్రముఖ పాత్రికేయులు. ప్రస్తుతం అమెరికాలో ఉన్నారు.

మనుషులు వివిధరకాలుగా ప్రవర్తిస్తారు. అందులో మనకు యిష్టం లేనివాటికి ''పిచ్చి' ''ఉన్మత్తత'' ''మనోవికారం'' అని పేరు పెట్టడం, మానసిక చికిత్స చేయాలనడం, బలవంతంగా ఆస్పత్రిలో చేర్పించడం - యివన్నీ సాజ్ అభ్యంతర పెడుతున్నారు. తనలో తాను నవ్వుకోవడం, ఏడ్వడం, రోడ్డుమీద పోతూ అలా ప్రవర్తించడం ''పిచ్చి''గా వర్ణిస్తున్నారు. అలాంటి వ్యక్తి ఎవరి జోలికీ రాకుండా, హానిచేయకుండా వున్నంతవరకూ, బలవంతంగా ఆస్పత్రి పాలు చేయడాన్ని కూడా సాజ్ ఆక్షేపిస్తున్నారు.

స్క్రూ-డ్రైవర్ అనే మత్తు పానీయం వుంది. ఓడ్కాలో నారింజరసం కలిపి, స్క్రూ- డ్రైవర్ అనే పేరు పెట్టారు. మరమేకులు విప్పడానికి మనం వాడే స్క్రూ-డ్రైవర్ వుంది. స్క్రూ-డ్రైవర్ తాగినప్పుడు మత్తెక్కి ఒళ్ళు తెలియకుండా ప్రవర్తిస్తుంటే, స్క్రూ-డ్రైవర్ చెడిపోయిందని షాపుకు తీసుకెళ్ళి బాగుచేయమంటే ఎలావుంటుంది? మానసిక చికిత్స కూడా అలాంటిదే అన్నారు సాజ్.

మానసిక రోగం అనేది ఉపమాలంకారం వంటిదనే తన సిద్ధాంతాన్ని 5వ అధ్యాయంలో సాజ్ సమర్థించారు. ఒక విషయానికి మరోపేరు పెట్టి అలంకారంగా మనం వాడుతుంటాం. వాటిని సాగదీసి, నిజం అనుకుంటే చిక్కువస్తుంది. కాని సైకియాట్రి నేడు అలాగే చేస్తున్నది. ఫాదర్ అంటే తండ్రి. క్రైస్తవ ఫాదర్ అంటే పూజలు చేసే పురోహితుడు. నిజమైన తండ్రికీ క్రైస్తవ ఫాదర్‌కూ వాడుకలో తేడా వుంది. రెండూ ఒకటే అనుకుంటే చిక్కువస్తుంది.

అలాగే కొన్ని హాస్య ఉపమానాలుంటాయి. వాటిని విని నవ్వుకొని ఆనందించాలేగాని, తు.చ.తప్పకుండా స్వీకరిస్తే చిక్కువస్తుంది.

ఒక అమెరికా యాత్రికుడితో చైనా అధికారి యిలా అన్నాడు. ప్రపంచంలో అతి పెద్ద దేశం ఏదో తెలుసా? క్యూబా. క్యూబా ప్రభుత్వం మాస్కోలో వుంటుంది. క్యూబా సైన్యం ఆఫ్రికాలో వుంటుంది. క్యూబా వాసులు అమెరికాలోని ఫ్లోరిడా రాష్ట్రంలో వుంటారు.

ఇది సునిశిత విమర్శనాయుత వ్యంగ్యంగా, స్వీకరించాలి. వాస్తవంగా గ్రహిస్తే ప్రమాదం. సైకియాట్రిలో మనిషి ప్రవర్తనను యిలా స్వీకరించడం జరుగుతున్నదని సాజ్ చూపడానికి చాలా ఉదాహరణలు యిచ్చారు.

అనుకరణ గురించి రాస్తూ, మానసిక రోగాలలో యిదెలా పరిణమించిందో చూపారు. ఇతరులను అనుకరించడం, జబ్బుగా వున్నట్లు నటించడం సైకి యాట్రి సమస్యలలో ప్రధానంగా వున్నట్లు సాజ్ వివరించారు. చార్కాట్‌కాలంనుండీ యిలా మానసిక రోగులుగా, మూర్ఛరోగులుగా నటించడం వస్తున్నది. దానికి తగ్గట్లే నయం చేసినట్లు నటించడం కూడా వచ్చింది.

మానసిక రోగాన్ని వివరించి, మనస్సు, మానసిక రోగం అంటే విడమరిచి, అంతా గాలి మాట అని చూపారు.

మొత్తం మీద యీ పుస్తకం ''పిచ్చి'' వైద్యం చేసే వారికి మింగుడుపడని వాదనలతో వుంది. సాధారణ పాఠకులకు చాలా ఆశ్చర్యం కలిగించే విషయాలున్నాయి. మనందరం అలవాటుగా, ప్రశ్నించకుండా ఆమోదించే విషయాలను సాజ్ ప్రశ్నించి మనల్ని ఆలోచింపచేటట్లు చేస్తారు.

జబ్బు అనేది చాలా లోతుపాతులతో సాజ్ చర్చించారన్నాం గదా. ఉదాహరణకు కొందరికి ''ప్రేమ జబ్బు'' వుంటుంది. ఇది ఉపమానంగా స్వీకరించాలేగాని, శరీరానికి ఏదో జబ్బు చేసినట్లూ చికిత్స అవసరమైనట్లూ భావించరాదు. కొందరు ఆర్థిక యిబ్బందుల వలన దిగజారి పోవచ్చు. మాట్లాడడం యిష్టం లేక మౌనం వహించవచ్చు. వారికి జబ్బు వున్నట్లు భావించరాదు. కాని సైకియాట్రిస్టులు అలాంటి వారిని కూడా రకరకాల ''పిచ్చి'' పేర్లు పెట్టి ఆస్పత్రి పాలుచేస్తున్నారు.

రోగికీ వైద్యుడికీ గల సంబంధాన్ని చర్చించినప్పుడు, రోగిపై సైకియాట్రిస్టుకు గల పట్టు ఎలాంటిదో సాజ్ వివరించాడు. ఈ సందర్భంగా ఆయన అధికారానికి చెందిన వివిధ దృక్పథాలను బాగా విడమరచి చెప్పారు.

రోగులకు గల హక్కులను సాజ్ చర్చించారు. చట్టవిరుద్ధంగా ప్రవర్తించని రోగులకు హక్కులుంటాయి. చట్టాన్ని అతిక్రమించిన వారిని శిక్షించే తీరు వున్నది. మానసిక రోగులు ఇతరులను కొడుతున్నారని, ఆస్తికి నష్టం కలిగిస్తున్నారని అంటారు. అలాంటి పనులు నేరం క్రిందకు వస్తాయి. కాని అలాగాక, వారికి ''పిచ్చి'' అని ముద్రవేసి, ఆస్పత్రి పాలు చేసి సైకియాట్రిస్టులు వారిని తమ బానిసలుగా చేసుకుంటున్నారనేది సాజ్ విమర్శ. మతం మత్తుమందు అని మార్క్స్ అన్నాడు. సాజ్ దృష్టిలో మతాన్ని సృష్టించిన మనిషే మత్తును కూడా సృష్టించుకున్నాడంటారు. మాటలగారడీలో పడి కొట్టుకుంటున్నా మని సాజ్ వాదన.

జబ్బు వస్తే, డాక్టర్లు నయం చేయాలేగాని, ఉద్దేశాలు అంటగట్టరు. సైకియాట్రిలో ఉద్దేశాలు చూస్తున్నారు. ఒక 42 ఏళ్ళ స్త్రీ తాగి, కారునడుపుతుండగా, పోలీసు పట్టుకొని వూపిరి పరీక్ష (తాగుడు నిర్ధారణకు) చేయబోగా ఆమె నిరాకరించింది. తన్నేసింది, అరిచింది. గొడవ చేసింది. కోర్టులో న్యాయమూర్తి ఎదుట చెబుతూ, బహిష్టుకు ముందు లక్షణాలుగా తన ప్రవర్తనను వివరించింది. కోర్టు ఆమెను వదిలేసింది! సాజ్ యిలాంటి ఉదాహరణలు యిస్తూ, నేరానికీ రోగానికీ తేడా చూడనప్పుడు యిలాంటి స్థితి వస్తుందన్నాడు.

సైకియాట్రి పేర్కొనే అనేక లక్షణాలు వ్యక్తిగత, ఆర్థిక, చట్టబద్ధ, సామాజిక, రాజకీయరంగాలకు చెందినవని, వైద్యరంగంలోకి రానివనీ సాజ్ చూపారు.

సాజ్ వాదనలకు సమాధానం చెబితే, సైకియాట్రిస్టుల వృత్తి దెబ్బతింటుంది. ఆదాయం పోతుంది. కనుక వాదనకు దిగరు. శాస్త్రీయ వివరణకు పూనుకోరు. తమ పలుకుబడి వినియోగించి పెత్తనం చేస్తున్నారు.

ఆత్మ, మనస్సు, మోక్షం, నరకం దేవుడు, దయ్యం మొదలైనవి పురోహిత వర్గానికి ఆయువుపట్టు. వాటిని రుజువు చేయాల్సిన బాధ్యత వారికి లేదు. మనుషులు నమ్మినంతకాలం అవి వారి ఆయుధాలే.

మానసిక రోగం మనో వికారం, ఉన్మత్తత, పిచ్చి యిత్యాదులు సైకియాట్రిస్టుల అస్త్రాలు. అవి రుజువుకు నిలబడతాయా లేదా అనేది వారికి పట్టదు. దీనిపై వారి వ్యాపారం సలక్షణంగా సాగిపోయినంతకాలం, జనం ''పిచ్చి'' వదలదు!



A lordly Brahmin bull stands above the Ganga, at the cremation ghats, leading down to the river in Varnasi. It is here that all souls are jettisoned into the next life, despatched as ash into the muddy, lugubrious river.

— *Photographer :* **Raghu Rai**

MISIMI/ RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd No. H/SD/191.




Joseph Brodsky

*"for an all-embracing authorship imbued with clarity of thought and poetic intensity"*

1987 Nobel Prize in Literature